# ఉత్తరాలు

## సీరియల్ కథ

వళినిని రత్న పినతండ్రి కూతురుగా అంటే, అక్క చెల్లెళ్ళుగా చిత్రించి, ఆశాచేత అక్కయ్యా! అని అనిపించడం నాకు బోధపడలేదు. శర్వాణి గారు ఈ పొరపాటు చేశారేమో అని అనుకొంటు న్నాను. కాక, ఆ సంబోధన సరిఐనదేనా ? నా ఈ అనుమానం తీర్చవలెనని కోరుతున్నాను.

శేషశివ (న్యూఢిల్లీ)

*  *  *

"తామరకొలను" సీరియల్ చాలా మనో రంజకంగా ఉంది. రమేష్‌పాత్ర బాగుంది. కాని, మూడు వారములై రమేష్, రత్న మొదలైన బొంబాయి విషయాలే కాని రమేష్ తల్లి, తండ్రి, అన్న, గురించి ఒక్కసారైనా వేయలేదు. కాని రమేష్ రత్నలో ఏం చూసి ఆప్యాయత పెంచు కున్నాడో తెలియటంలేదు. మరియు శేషగిరి ప్రక్క రత్న కూర్చుంటే రమేష్ అసూయ చెందుతా డెందులకు ? ఆమె పరాయి మనిషని తెలుసుకదా !

శ్రీమతి సత్యన్నారాయణ (మల్యాడ)

## ముఖచిత్రం

కవరు పేజీమీద ఈ మధ్య కొన్నాళ్ళుగా, అప్పుడప్పుడు మీారు వేయుచున్న సినీతారల బొమ్మలు భారతీయ సంస్కృతీ సాంప్రదాయా లకు భిన్నంగా ఉంటున్నవని నా భావన. ఉదాహర ణగా తేది 14—6—63న కవరుమీద వేయ బడ్డ ఫోటోను తీసుకోవచ్చు అట్టి బొమ్మలను— శరీరంమీద దుస్తులు మొదలైనవి ఉండవలసిన విధంగా లేని బొమ్మలను— ప్రచురించటం మీబోం ట్లకు భావ్యం కాదని వ్రాస్తున్నాను

ఉమిరి సన్యాసమ్మ (విజయనగరం)

## కథ

"ఉమ" రచించిన "అపార్థం" నాకు చాల మంచిగా అనిపించింది ఆమె చాల మధురంగ వ్రాసింది. ఈ కథను చదువుతూంటె నాకొక విధ మైన ఉత్సాహము సంతోషము కలిగింది.

డి రమ లు (కొత్తకోట)

## ధూమపానం

శ్రీ గిరీశం చుట్టలే కాల్చినందుకు ఆయనని అభినం దించాలి నరాలను బిగపట్టి ఉంచటం సిగరెట్ పొగ వలన జరుగుతుంది అందువలననే "బాగా ధూమ పానం చేసేవారిలో ఉత్సాహం, శక్తి ఎక్కువ ఉంటా" యన్నది నిజం. కాని అది ధూమపానం చేస్తున్నంతసేపే ఉంటుంది. అందుకే కొందరు చైన్ స్మోకింగ్‌లో 'కింగు' లవుతారు. అలాంటి కింగులను చీట్లపేక, చెస్ (ఆడేవాళ్ళ) లో ఎక్కు వగా చూస్తూంటాము. నేటి యువకులకు సిగ రెట్ కాల్చటం ఒక ఫ్యాషన్. కాని అందువలన ఎంత నష్టమో ఈ వ్యాసమువలన తెలుసుకొని కొంత వరకైనా మానగలరని ఆశించవచ్చు

స్మోకింగ్ కింగ్ (ఏలూరు)



# మరొక కొత్త సీరియల్

# 'కొలంబా'

ప్రాస్పర్ మెరిమె రచించిన ఫ్రెంచి నవల

## వచ్చే వారమే ప్రారంభం!



'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచు రణకు ఇండియన్ ఇంక్‌తో వేసిన కార్టూ నులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4" × 2", 4" × 4" చిత్రాలు ప్రతి కలో పడుతూ ఉంటాయి

ఆంధ్రసచిత్రవార

# పత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
*
శుక్రవారం : 28—6—63
శోభకృన్నామ సం॥ ఆషాఢ మాసం॥ శుద్ధ సప్తమి
సంపుటము : 55 సంచిక : 43
స్థాపితము :
1908
*
ముఖ్య సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్
*
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ
*
ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా . రూ. 13.00 ఇతర దేశాలు. ఓడమీద Sea Mail రు. 20.00. (విమానం ద్వారా (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా 135.00.)
*
విడి ప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13.0.0.
*
ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1



నటి రాజశ్రీ (ఫోటో ప్రభాకర్)

# మనలోమాట

ముఖచిత్రం పోటీ బొమ్మ వచ్చే వారం సంచిక మీదచూడ వచ్చు— ఈసారి వాయిదా ఉండదు!

* * *

ఆంధ్రసచిత్ర వారపత్రికలో రక రకాల విషయాలపై వ్యాసాలు వేస్తూ ఉంటాము. కాని రచయితల అభిప్రాయాలన్నీ అవశ్యం ఆంధ్ర సచిత్ర వారపత్రికవి గా ఉండనవసరం లేదు!

* * *

వచ్చేవారం తిరిగి 'తెర వెనుక'కి పోబోతున్నాము... ఈసారి ఇంటర్వ్యూ ఒక ప్రఖ్యాత దర్శకునితో వుండగలదు.

* * *

క్రమంగా ఆపివేసిన శీర్షికలు కొన్ని మళ్ళీ ప్రారంభించటానికి ప్రయత్నిస్తున్నాము. 'వివిధ ప్రాంతాలలోని వింత ప్రదేశాలు', 'ప్రపంచ ప్రముఖులు' త్వరలో మొదలు పెట్టగలము.

* * *

కొన్ని సాంకేతిక కారణాలవల్ల ఇటీవల కొంతకాలంగా ఆంధ్రసచిత్ర వారపత్రిక అట్ట వెనుక పేజీలు ఖాళీగా ఉంచాము కాని ఈ సంచిక నుంచీ కొన్ని ఫోటోలు ప్రచురించడం ప్రారంభించాము.

★

## లోకంపోకడ



నేనీ గెడ్డాం భగ్న ప్రేమికుడనై పెంచలేదు. నన్ను అధికారులు సాంకేతిక కళాశాల సెలక్షన్ కమిటీలో సభ్యునిగా వేయమని అన్నారు. అందుకనే యిది పెంచుతున్నాను. బ్రదర్!

# విషయానుక్రమణిక


నారేపటి దారి
కాస్త చూపించండి
పండిట్ జీ!


కె డి.ఎమ్
ఎడబాటుంటే నే
ఎదలో దిగులూ.
కేరళలో
మంత్రులు
కేరళ
కాంగ్రెస్ పార్టీ


మీనన్
గారే
కావాలీ!
జైపువ్వవ
హారపు
మీనన్ జీ
కావాలీ!
నేఫా నేత
మీనన్
కావాలీ!
వి.కే.కే
రావాలీ
మాకు
మీనన్
కావాలో
య్!



బ్రిటన్‌లో 12రోజుల పర్యటనకోసం రాష్ట్రపతి రాధాకృష్ణన్ 12వ తేదీన లండన్ చేరుకున్న తరువాత విక్టోరియా స్టేషన్ వెలుపల ఫిలిప్ రాకుమారునితో కలసి సైనికుల గౌరవ అభివందనాన్ని తిలకించారు

# ఢిల్లీలో వాతావరణం

శ్రీ కృష్ణ

ఢిల్లీ వాతావరణం ఎలా ఉంటుందో ఎవరూ చెప్పలేకపోతున్నారు జూన్ నెల సగం పైగా అయిపోయినా గాలిలో తేమ మరీ అధికంగా ఉంది 'ఆవిరి స్నానం' చేస్తున్నామా అన్నట్లుంది అప్పుడప్పుడూ వానలు కురుస్తూ ఉంటాయి తాత్కాలికంగా చల్లపడుతూ ఉంటుంది

రాజకీయ వాతావరణమూ అంతే ఆగస్టు 15, 1947 నుంచి అవిరామంగా అధికారం చెలాయిస్తూ వచ్చిన కాంగ్రెస్ నాయకులకి ఉ. ప్ర., గుజరాత్ ఉప ఎన్నికలలో అపజయాలు కలవరం కలిగిస్తున్నాయి తప్పు ఎవరిమీద తోద్దామా అని చూస్తున్నారు కాంగ్రెస్ ఓటములు బాధాకరంగా ఉంటే, కృపలానీ, లోహియాల గెలుపులు మరీ బాధాకరంగా ఉన్నాయి ఈ ఇద్దరూ కాంగ్రెస్‌పట్ల గాఢమయిన వైరుధ్యం చూపిస్తూ వచ్చారు లోహియా, తాము లోక్ సభలో గందరగోళం ప్రారంభించబోతున్నామని బహిరంగంగా చాటుతున్నారు

కథ ఇంతటితో ముగిసిందనటానికి వీలులేదు హాఫీజ్ మహమ్మద్ ఇబ్రహీం అపజయం అతని రాజకీయ జీవితాన్ని అంతం చేసింది ఎప్పుడో రిటయిర్ కావలసినవాడు కాని కాంగ్రెస్ వారికి ఎప్పుడు, ఎలా రిటయిర్ కావాలో తెలియదు, హాఫీజ్ ప్రధాన మంత్రి చుట్టూ తిరుగుతున్నారు కనీసం గవర్నర్ అవుతామేమోనని కాబోలు.

ప్రధాన మంత్రికి మరొక బాధ పట్టుకుంది హాఫీజ్ మహమ్మద్ ఇబ్రహీం కాబినెట్ వదలివేస్తే మంత్రివర్గాన్ని 'కలపవలసి' రావచ్చు పండిత మాలవ్యా శ్రీయుతులు కె సి రెడ్డి, గోపాల రెడ్డి కూడా మంత్రివర్గంలో నుంచి నిష్క్రమిస్తున్నారనే వదంతులు ఉన్నాయి ఈ వదంతులు నిజమయినవికావు ఇద్దరు రెడ్డి ప్రభృతులూ మంత్రిపదవి విరమించవలసిన అవసరం ఏమిటి ? వారి ఆరోగ్యాలు సరిగ్గా లేవంటారు కొందరు కాని ఇది నేడు కొత్తగా వచ్చినదేమీ కాదు గదా !

అసలు నెహ్రూ కాబినెట్‌లో చేరాలంటే కనీసం గుండె జబ్బయినా ఉండాలి శ్రీ ఖన్నా కేంద్ర మంత్రుల ఎలక్ట్రిసిటీ బిల్లును గురించి హడావుడి చేశారు వారి మెడికల్ బిల్లులో తక్కువేమీ ఉండవు అంటే ఇద్దరు రెడ్డి ప్రభృతుల పదవులూ సురక్షితంగానే ఉన్నాయన్నమాట

ఇక హాఫీజ్ సాహెబ్‌ని కాబినెట్ నుంచి పంపించి వేస్తే ఆయన స్థానంలో మరొక వృద్ధ ముసల్‌మాన్‌ని వెయ్యాలి, వేస్తారు ఇది ముసల్‌మాన్‌లకు కేటాయించిన పదవి మరొక మతం వారిని వేస్తే దేశంలో 'మతాతీత' సిద్ధాంతాలకి దెబ్బ పాతచరిత్ర పరిశీలిస్తే పండిత నెహ్రూ మధ్యలో మంత్రులని మార్చే అలవాటు లేదనిపిస్తుంది అయినా హాఫీజ్ పదవికోసం అప్పుడే ఇద్దరు పోటీ పడుతున్నారు ఉత్తర ప్రదేశ్ మంత్రి అలీజహీర్, అస్సాం మంత్రి ఫక్రుద్దీన్ అహమద్

* * *

అయిదుగురు ఐ సి ఎస్ అధికారులు ఈ ఏడు రిటయిర్ కావాలి— రాష్ట్రపతి కార్యదర్శి, ఎస్ దత్, శ్రీ యం జె దేశాయ్ (విదేశాంగశాఖ కార్యదర్శి), ఇరిగేషన్, పవర్ కార్యదర్శి శ్రీ వి. దేవ, సమాచార ప్రచారశాఖ కార్యదర్శి యం యం ఫిలిప్స్, మూడవసారి 'ఎక్స్‌టెన్షన్' (Extension) ముగియనున్న ప్రధాన కార్యదర్శి ఆర్ కె నెహ్రూ

ఐ సి ఎస్ ఉద్యోగాలు 'కాంట్రాక్టు'ల మీద ఆధారపడి ఉంటుంది ప్రతి ఉద్యోగికి నిర్ణీత కాలాలకు నిర్ణీత వేతనాలు ఏర్పరుస్తారు గడువు కాలం తర్వాత 'ఎక్స్‌టెన్షన్' ఇచ్చే అధికారం ప్రభుత్వానికిలేదు పండిత నెహ్రూ ప్రభుత్వం చేసిన అక్రమ కార్యాలలో కొందరు ఐ సి ఎస్ వారికి మాత్రం ఉద్యోగాలు పొడిగించడం కొన్ని 1962 వరకూ విదేశ శాఖలలో కూడా 'ఎక్స్‌టెన్షన్'లు జరుగుతూ ఉండేవి కాని ప్రస్తుతం ధోరణి దీనికి విరుద్ధంగా ఉంది అవసరం అయితే సర్వీస్ అయిపోయిన వ్యక్తి తిరిగి ఉద్యోగంలో వెయవచ్చుకాని అదే ఉద్యో

—49 వ పేజీ చూడండి

# సరాగమాల

## వి ఎ కె రంగారావు

ఈ మధ్య, ఆ మధ్య ప్రాంతాలకు, అంటే విశాఖ పట్టణం, విజయనగరం, బొబ్బిలి, పార్వతీపురం మొదలయినవి; చుట్టపు చూపుగా ఏగా–దిగా వెళ్లాను. చూచి వచ్చాను. అచ్చటి వింతలు, విచిత్రాలలో సరాగమాలకు సంబంధించిన విషయాలు:

మొదటి మజిలీ విశాఖ. చేరేసరికి రాత్రి ఎనిమిది న్నర దగ్గర కావచ్చింది కాని చాల రోజులైనది కాబట్టి ఆ ఊళ్లో ఉన్న గ్రామఫోన్ రికార్డు డీలర్లను పలకరించటానికి వెంటనే బయలు దేరాను. వన్‌వే మెయిన్ రోడ్‌లో మొదట ఉండేది నేను క్రితం అనవాయితీగా లాంగ్ ప్లేయింగ్ రికార్డులు కొంటుండే చోటు. విశాఖవంటి ఊళ్లో ఉండవలసినంత కన్నా యెక్కువ లాంగ్ ప్లేయింగ్ రికార్డులు యెప్పుడూ ఇక్కడ ఉంటాయి కాబట్టి ఆ రోజుల్లో ఇది నా కాతా కొట్టు అయింది. కనబడగానే వెంకట్రామయ్య గారు కుశల ప్రశ్నవేసి కూర్చోబెట్టగా వారి ఇద్దరబ్బాయిలు చెరో ప్రశ్న చిలకరించారు. కొట్టు కట్టేసే వేళ. మళ్లీ కనబడతానని చెప్పి లేవబోతుండగా మరో నాలుగు నిముషాలు ఉండి వెళ్ళమన్నారు. సరేనని కూర్చుంటే అక్కడ పని

## నామరూపాలు - 7



*నెలు రూపం ఆంధ్రసచిత్రవారపత్రికకు ప్రత్యేకం తీసినది.

[illegible] పకోడీల పొట్లం విప్పిపెట్టారు. "ఇదేమిటి వెంకట్రామయ్యగారూ మధ్యరాత్రి పకోడీల ఫలహారం తెప్పించా"రని అడిగితే "మీక్కాదు: ఎలకలకి" అని జవాబిచ్చారు. ఏదో పరిహాస మనుకొని నవ్వేస్తే "హాస్యంకాదు. రోజూ రాత్రి కొట్టు మూసేటప్పుడు యెలకలకి యేదో ఒక ఫలహారం లంచంగా పెట్టకపోతే, రేడియోలనో, రికార్డులనో కొరికి పాడుచేస్తాయని వివరించారు. భలేగా ఉందనుకొన్నాను. ఇన్ని రోజులబట్టి లంచాలను తినేది మనుష్యులే అనుకున్నాను. ఎలకలూ పడతాయన్నమాట!

వెంటనే వెళ్లిపోతున్నందుకు వారికి యేదో సర్దిచెప్పి ఆ దారిలోనే ఉన్న రెండవ షాపుకి వెళ్లాను. కాలు పెట్టగానే అన్నదమ్ములు ముగ్గురూ వచ్చి, ఆప్యాయంగా పలకరించి, పైనాపిల్ కూల్ డ్రింక్ ఇచ్చి (మధ్యాహ్నం మండుటెండలో వెళ్లినా, వర్షంలో చితక తడిసి వెళ్లినా అయిన్ డ్రింక్ ఇవ్వడం మానరు) రికార్డు లేమైనా కావాలా అన్నారు. మద్రాసు నుంచి వస్తున్నాను అవన్నీ అక్కడే దొరకలేదనుకోయి "ఇప్పుడు కొత్తవి లేదండి పలకరించడానికి వచ్చా"నన్నాను. ఈ జవాబుకి ఒక కారణం ఉంది. మద్రాసులోనేకాదు బహుశ: యెక్కడా దొరకని రికార్డులు ఇక్కడ దొరుకుతాయనడంలో అతిశయోక్తి ఉండదేమో సుమంగళి రికార్డులు, శాంతి నివాసం రికార్డులూ ఒకే చోట ఉండటంవలన కాస్త వెతుక్కోవలసి వస్తుంది కాని ఓపిక, తీరిక ఉన్నవాడికి ఇక్కడ యెన్నో పాతరికార్డులు, సరి కొత్త కండిషన్‌లో దొరుకుతాయి వారికి సెలవుచెప్పి మళ్లీ రోడ్డెక్కేసరికి తొమ్మిదింపావు దాటింది.

మూడవ షాపు దాటా అప్పుడే తాళాలు వేసి ఇంటికి పోతున్నారు వాళ్ళు, నా దాహం చూసి, తాళం, తలుపులూ, తీసి, దీపం, పెట్టివేసి కూర్చొన్నారు. నేను రాజమహల్లో ఉంటున్నరోజుల్లో ఇక్కడే డజన్లకు డజన్ల హిందీ రికార్డులు ఆర్డరిచ్చి తెప్పించుకొనేవాడిని. ఈ రాజాలో ఒక ప్రత్యేకత అంటే సంగీత ప్రియులకు తెలియవలసిన ఒక ప్రత్యేకత ఉంది. వారికి గిటార్ వాయించడంవచ్చు. తమకు తామే నేర్చుకున్నారు. బ్రహ్మాండంగా వాయించకపోయినా వినసొంపుగా వాయించగలరు ముఖ్య విషయం చెప్పాలంటే నాకు ఇతర వ్యాపకాలు లేనప్పుడు మధ్యాహ్నాలు షాపులో వెళ్లి కూర్చుంటే, కాదనకుండా అడిగిన పాటలన్నీ "పిలచిన బిగువటరా" నుంచి "పెరిఫిడియా" వరకూ, వాయించేవారు. స్పైగా వీరికి బినాకావిట్ పెరేడ్ ఇంటరెస్టం.

ఆ మరుసటి దినమే తెల్లవారు జామున బయలుదేరి రాజమహలుకు వెళ్లాను ఆ సాయంత్రం ప్రక్కనే ఉన్న బొబ్బిలికి వెళ్లాను. కనబడిన వారందరూ అంతకు రెండు వారాలముందు ఆ ఊళ్లో జరిగిన చిట్టిబాబు వీణకచ్చేరి గురించి వేనోళ్ల పొగడారు సంగీత శాస్త్రం రేఖామాత్రం తెలిసిన రమణాజీగారు అక్కడ చెప్పినదానివలనా, శ్రీయుతులు కస్తూరిరావు ("ప్రకృతిని అనుసరించడం మానవుడికి అలవాటు— దాన్ని అధిగమించటం మహా మనిషి లక్షణం— ఆ లక్షణం పుణికి పుచ్చుకొన్న చిట్టిబాబుకు నా జోహార్లు") భోగరాజు బలరామమూర్తి ("ఒకే వీణాస్త్రం ఒకే

మృదంగం సహాయంతో ఇంత చిక్కటి కర్ణాటక, పాశ్చాత్య, హిందూస్థానీ రాగాలను అవలీలగా వాయించి, మూడు గంటలసేపు, ప్రేక్షకులను ఆనందడోలికలను ఊగించిన చిట్టిబాబు నిజంగా ఒక కళా తపస్వి") (వ్రాసిన ఉత్తరాల వల్లా ఆ కచ్చేరీ అతి విజయవంతంగా జరిగిందని తెలుస్తున్నది ఈ ప్రోగ్రామ్ శ్రీ యోగనాథన్ రావుగారి నిర్వహణలో, శ్రీ శ్రీనివాస నాటక కళాసమితి తరఫున జరిగిందట.

రాజమహల్లో, చల్లగాలుల, సన్నజాజుల సౌహార్ద్యంలో, సన్నిహితుల స్నేహితుల సాన్నిధ్యంలో, మల్లెపువ్వుల మంచిమనసుల సామీప్యంలో మూడు రేలు, మూడు పవళ్లు మరపురాని మధుర స్వప్నంలా గడిచిపోయినవి

ఆ తరువాతి మజిలీ పార్వతీపురం ఒకో ఊరు, నా మనసులో ఒకో పాటతో ముడిపడి ఉన్నట్లే ఒకో వ్యక్తిని చూస్తే, నాకు ఒకో పాట గుర్తుకు వస్తుంది పార్వతీపురం రహదారి బంగళాలో రాత్రి తొమ్మిది గంటలకు విలాసినీ—జన సమాగమాభిలాషియై వెడలుచున్న విటరాజులా వయ్యారంగా వెనుక—కాళ్లకు నటనలు నేర్పే నటరాజులా నయగారంతో, కలువ చెలితో కలయికకై కలవరించే వెలరాజులా నాజూకుగా దర్శనమిచ్చిన శ్రీ పి వి ఆర్ ని చూడగానే "ఏ కనుసన్నలా, నీ చిరునవ్వులా, అర—విరిసిన విరజాజి మల్లెపువ్వులు" గుర్తుకు వచ్చింది ఈ సంగతి వారితో చెప్పకండి నిజమాడితే వారికీ కోపం వస్తుంది అంతగా చెప్పాలని ఉంటే, సగం చెప్పి వూరుకోండి ఆ సగం పొగడ్తలు వారి కలవాటే గనుక పొరపాటుగా అర్థం చేసుకోరు

ఆ మరునాటి దినం తెల్లవారు జామున మళ్లీ రైలెక్కాను విజయనగరం స్టేషన్లో జి డి దాసుగారు కలుసుకున్నారు కొన్ని మాసాల క్రితం కొన్ని వారాల పర్యంతం కదన కుతూహల జనక రాగం గురించి నాతో పత్రికాముఖంగా యుద్ధం జరిపారే ఆ జి డి దాసుగారు కనబడిన వెంటనే తమ్ము పరిచయం చేసుకొని, ఒక అరడజను పుస్తకాలు, మరొకఅరడజను గుర్తుపెట్టుకొన్నరెఫరెన్సులూ చూపించి, వివరించి కదన కుతూహలం వారన్నట్లు ధీర శంకరాభరణ జన్యమే అని బల్ల, కాదు, సీటు గుద్ది, మరీ నిరూపించారు మహాశయా! ఐ స్టాండ్ కరెక్టెడ్

వీరు వచ్చే వినాయక చవితికి జరుపబడే ఉత్సవాలలో బొబ్బిలిలో మురళీ వాద్య కచ్చేరీ చేస్తారుట అందుకోసమైనా మళ్లీ బొబ్బిలికి వెళ్లాలని ఉంది వీరికి మురళీ విద్వాన్ అనే బిరుదు కూడా ఉందని నాకు దరిమిలా తెలిసింది ఇక నా కేమి ? రావణుడు శివునితో అన్నట్లు వారిద్దరిలో యెవరు గెలిచినా రావణునిదే కీర్తి శివుడు గెలిస్తే భక్తునితో యుద్ధం చేశాడనే అపనింద శివునికి, దేవునితోనే రణం సాగించాడనే కీర్తి రావణునికి రావణుడే గెలిచాడా, మానవునికి ఓడినాడనే అపకీర్తి శివునికి, దేవుడినే జయించాడనే యశస్సు రావణునిది నేనూ, దాసుగారు జరిపిన పోరులో నేను రావణుని స్థితిలోనే ఉన్నాను

త్వరలో ప్రముఖ శ్రేణిన వెలుగొందబోయే పాటల రచయిత వీటూరి గురించి దాసుగారు తెల్పిన గుప్త స్వరం (విజయనగరం వీరిద్దరూ స్నేహితులట) వీటూరి చక్కగా పాడటమేకాక హార్మోనియం కూడా వాయిస్తారట ఈ సారి వీటూరి కనబడితే "బిగువేల జేసెవు నవమోహనా" (రేఖా మురళి ఆర్ట్స్ వారి "కాళహస్తి మహాత్మ్యం"లో అందమైన జావళి) పాడించుకుంటాను

ఆ రైల్లోంచి దిగింది విశాఖలో ఉన్నది మూడు రోజులు సంగీత వ్యాపకాలేవీ లేవు సంగీత ప్రియులైన లక్ష్మణమూర్తి, గోవిందరావు, జానకిరావు ప్రభృతులను కలుసుకున్నా, సంగీతం గురించి యెక్కువగా మాట్లాడుకోవటానికి అవకాశం చిక్కలేదు ఇందులో గోవిందరావు మురళి వాయిస్తారు తక్కిన ఇరువురు ఆమధ్య (ఏ మధ్య ?) ఆర్మోనీ సాధన చేసేవారు



'తేరే ఘర్ కే సామ్నే'లో నూతన్

## సరాగమాల ఉత్తరాలు

15—3—63 ఆంధ్రవారపత్రికలో విజయవాడ నుంచి రాసి పద్మావతిగారికి జవాబిస్తూ, ఒక పాటను విమర్శించేటప్పుడు నన్ను గాయకులుగా గౌరవించటమంటే ఎలా కుదురుతుంది ఎవరెవరు ఏయే బూతు పాటలు పాడారో నంబర్లతో సహా ఇవ్వగలను అని వ్రాశారు పద్మావతి అడిగిన ప్రశ్నలో ఏమీ తప్పు లేదు నేను కూడా పద్మావతిగారితోనే ఏకీభవిస్తున్నాను మీరు కూడా నా ప్రశ్నలకి ప్రతికాముఖంగానే జవాబివ్వండి

వారు చెప్పిన రెండవ తెగవారు బూతు పాటలు పాడారని అన్నారు అది అన్యాయం ఎందుకంటే ఆ గాయకుల తప్పు లేదు ఆ బూతు పాటలో వ్రాసిన రచయితలని, నిర్మాతలని, సంగీత దర్శకులనీ అనాలి గాని, గాయకులు వారెలా పాడమంటే పాడతారు ప్రేమ—పాటలే పాడుతాను, బూతు పాటలు పాడను అని మడిగట్టుకొని కూర్చున్న వాళ్లకి ఎలా కుదురుతుంది అది వారి జీవనోపాధి కదా !

మీరు ఆమెని విమర్శించడం ఏమీ బాగులేదు ఎల్లాగైనా మీరు ప్లేబాక్ గాయకుల విషయంలో పక్షపాతంగానే ఉంటున్నారు

కె పద్మావతి (చెన్నూరు)

* * *

"శ్రీకృష్ణార్జున యుద్ధంలో" "దేవదేవ నారాయణ" అనే పాట ఎవరు పాడారో అని సందేహంగా యుండి, కాస్త తెలియజేయండి! తరువాత "అంచెలంచెలు లేని మోక్షం" అనే పాటలో 'స్వామి, స్వామి, ఏమి ఏమి, అదే మరి, అనే మాటలు ప్లేబాకు గాయకులే అంటారా ? లేక నటీనటులా ? శ్రీ నాగేశ్వరరావుగారికి మాధవపెద్ది రెండు పద్యాలు పాడారని నేను, పాడలేదని—ఆ పద్యాలు ఘంటసాలే పాడారని నా మిత్రుడు వాదించుకొని పైగా) 'బెట్' వేశాము

సి హెచ్ జయదామోదర్ (ఖర్గపూర్)

# నగరంలో పంచదార దొంగ వ్యాపారం!

రాజధాని నగరం అనంగానే, దానికేదో ప్రత్యేకతలుంటాయని కొంతమంది అభిప్రాయం ప్రభుత్వం వారు, యీ నగరం పట్ల ప్రత్యేకమైన శ్రద్ధ చూపిస్తారని ఓ భావం అంటే, ఏ విషయంలోనైనా ఓ లోపం, యితరచోట్ల కనబడితే యీ ఊళ్ళో కాబట్టి సరిపోయింది ఇదే కాపిటల్ సిటీ హైదరాబాదులో కనక అయితేనా, ఏదో చర్య, ఎవరో తీసుకొని ఉండేవాళ్ళు అని సామాన్య మానవుడు దూరాన్నుంచి ఊహించుకుంటూ ఉంటాడు తీరా దగ్గరకు వచ్చి చూస్తే, యీ హైదరాబాదు కంటె మన వూరే నయమేమో అన్నట్లు అనిపిస్తుంది ఇది ఏ ఒక విషయంలోనో కాదు, ప్రతి విషయంలోనూ కూడా కారణం, అధికారవర్గం యొక్క నిర్లక్ష్యం, ఒకవేళ లక్ష్యం ఉన్నా, తగిన చర్యలు తీసుకోవటానికి కావలసిన సిబ్బంది గాని, అధికారాలుగాని లేకపోవటం అశక్తత, అసమర్థతానూ ఈ రెంటి మూలాన ప్రజలు పడరాని పాట్లు పడటం ఇవి నిత్యమూ జరుగుతూనే ఉన్నాయి ఈమధ్యనే పంచదార కరువు ఏర్పడింది దేశం మొత్తంమీద పంచదార బోలెడంత ఉంది కొంతమంది దాచేసి, ప్రజలకు అందనీయకుండా అధిక లాభాలు సంపాదించటానికి చాటుగా మాటుగా అమ్ముకుంటున్నారనే వాదం అటుంచితే రాజధానికి సంబంధించినంతవరకు ఏమి ఏర్పాటు చేశారో చూస్తే, అవసరం అయినప్పుడు కూడా ప్రభుత్వ యంత్రాంగం, ఎంత మెల్లిగా కదులుతుందో తెలుస్తుంది పంచదారకు కొరత ఏర్పడబోతోంది అని యెట్లా పసిగట్టారో యేమో, క్షణాల్లో స్టాకంతా మాయమయిపోయింది ఎవర్నడిగినా, మా దగ్గర లేదంటే మా దగ్గర లేదంటున్నారు తెల్లారి లేస్తే చాయిగాని, కాఫీ గాని సేవించని వ్యక్తి ఒక్కడూ కూడా లేడని అంటే అతిశయోక్తి కాదు వీధికి రెండు, మూడు కాఫీ హోటళ్ళున్నాయి ఎంత పంచదారైనా వాళ్ళకే సరిపోతుంది! ఇంత సప్లయి అవుతూనే ఉంది ఒక్కనాడు హఠాత్తుగా, పంచదార వంతులన్నీ అదృశ్య మయిపోయినాయంటే, ప్రభుత్వం వారికి బాధ్యత లేదా ? వాళ్ళ దగ్గర లెక్కలు లేవా ! దొంగచాటుగా ఇతరచోట్లకు చేరవేసే 'సంఘ విద్రోహులను' పట్టుకునే యంత్రాంగము లేదా ? ఈ కొరత ఏర్పడ్డ తర్వాత, దొంగతనంగా, రాజధాని నగరంనుంచి రోజుకు 150 బస్తాల పంచదార యితర చోట్లకు రవాణా అవుతున్నట్లు అంచనా దీన్ని అరికట్టటానికి సత్వర చర్యలు తీసుకోకపోవటానికి కారణం ఏమిటి ! జంట నగరాల్లో మొత్తం 150 మంది దాక చిల్లర వర్తకు లున్నారు వాళ్ళ దగ్గరున్న స్టాకంతా క్షణాల్లో ఎట్లా అమ్మెయ్య గలుగుతారు ? ఒకవేళ అట్లా జరిగినా, టోకు వర్తకుల్నుంచి, సప్లయి సరిగా వస్తోందా అనే విచారణ ఉండాలిగా ! ఏమైనా యిలాంటి పరిస్థితుల్లో ఎప్పుడూ కూడా, కొంతమంది అన్ని వర్గాల్లో కూడా ఉంటూనే ఉంటారు స్వలాభాలకోసం ఏపని చెయ్యటానికైనా సిద్ధపడేవాళ్ళు వారిని ఓకంట కనిపెడుతూనే పరిస్థితి మెరుగుపడేటట్లు చూడాలంటే బాధ్యతైతే ఉందిగదా ! కొంతమంది చిల్లర షాపుల ముందర 'క్యూ' లో నిలబడి పంచదార తీసుకోవటం, బైటకు వచ్చేసి నిజంగా అవసరం ఉన్న వ్యక్తులకు ఎక్కువ ధరకు అమ్మేసెయ్యటం అవసరం ఉన్నవాళ్ళ 'క్యూ' లో గంటల తరబడి నిలబడలేక, గత్యంతరంలేక, ఎంత ధరకైనా కొనెయ్యటం జరిగింది ఈ తరహాగా సికింద్రాబాదులో దొంగ వ్యాపారం సాగినమాట నిజమే ! నగరమంతా

—45 వ పేజీ చూడండి



కాకినాడ 'సాల్టు క్రీక్' మీదుగా, కత్తిపూడి, నర్సాపురం రోడ్డుపైన కట్టిన ప్రి-స్ట్రెస్డ్—కాంక్రీట్ సిమెంట్ బ్రిడ్జి ఛాయాచిత్రం యీ బ్రిడ్జికి యిటీవల, ఆంధ్రప్రదేశ్ రహదారుల మంత్రి శ్రీ మీర్ అహమ్మదాలీఖాన్‌చే ప్రారంభోత్సవం చేయబడింది ఆంధ్రప్రదేశ్‌లో యిటువంటి బ్రిడ్జి నిర్మాణం యిదే మొదటిది—యీ బ్రిడ్జి వెడల్పు 58 అడుగులు—పయనీర్ యింజనీయరింగు సిండికేట వారు, యీ బ్రిడ్జి నిర్మించిరి—నిర్మాణవ్యయం 20 లక్షల రూపాయలు.

# ప్రాక్-పశ్చిమ సంబంధాలు: అయ్‌క్య రాజ్యసమితి పాత్ర

ఉథాంట్

(గత సంచిక తరువాయి)

అయ్‌క్యరాజ్య సమితిలో ఆఫ్రికా — ఆసియా దేశాల సంఖ్య పెరగడంవల్ల మూడు ధ్రువాలు పోయి ఎన్నో ధ్రువాలు ఏర్పడుతున్నాయి. సమితిలో పనిచేసే వారికి అందరికీ ఈ ధోరణి స్పష్టం అవుతుంది. ఆఫ్రికా ఆసియా సభ్యులందరూ ఒక జట్టుగా ఉండరు. వారిలోనే ఎన్నో పక్షాలున్నాయి. ప్రాక్— పశ్చిమ వర్గాల వైరుధ్యం ఒకటే కాక చాలా క్లిష్టమయిన పరిస్థితి ఏర్పడుతున్నది: ఈ పరిస్థితి ఎప్పటికప్పుడు మారుతూ ఉంటుంది.



రచయిత: ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శి శ్రీ ఉథాంట్.

సర్వప్రతినిధి సభలో సభ్యుల సంఖ్య అధికం అవటంవల్ల ఈ సంస్థకి మంచి బలం చేకూరింది. భద్రతా మండలిలో పెద్ద రాజ్యాలు ఒకరితో ఒకరు అంగీకరించకపోతే ఈ సంస్థ నిస్సహాయంగా ఉండిపోవలసిందే కాబట్టికూడా ప్రతినిధి సభలో ప్రాముఖ్యత ఎక్కువ అయింది. ప్రచ్ఛన్న యుద్ధభూమి అయిపోయింది.

అక్టోబర్ నెలాఖరులో క్యూబా పెద్ద సమస్య అవుతున్న సూచనలు కనిపించాయి. ప్రపంచంలోని రెండు మహారాజ్యాలు ఒకరి కొకరు ఎదురవుతున్నారు. దీనిని ఎలాగయినా అరికట్టవలసిన అవసరం ఏర్పడింది. ఈ భావాన్నే భద్రతామండలిలోనే నొకసారి వెలిబుచ్చాను. పై రెండు రాజ్యాల నాయకులనీ నిదానం చూపవలసినదిగా కోరాను. నా ప్రార్థనలు వ్యర్థం కాలేదు. ఆ కాలంలో ఏమి జరిగిందో అందరికీ తెలును. ఏవిధమయిన అభివృద్ధి కనిపించలేదనిపించిన సమయంలో కూడా చర్చలు సఫలీకృతమే అయ్యాయి. రెండు మహారాజ్యాలూ కొన్ని విషయాలపైన సమాభిప్రాయాలు చూపారు. క్యూబా సమస్య పరిపూర్ణంగా పరిష్కారం అవాలని కొందరికి ఉంటుంది కాని ఈ లోపభూయిష్టమయిన ప్రపంచంలో తరచు అసంపూర్ణ పరిష్కారాలని స్వీకరించక తప్పదు.

క్యూబా విషయంలో ఎలా ఉన్నారో అలాగే తక్కిన మరికొన్ని విషయాలలో కూ[illegible]రికా రష్యా ప్రభుత్వాలు రాజీకి సుముఖంగా [illegible] ప్రచ్ఛన్న యుద్ధానికి సంబంధించిన [illegible] కొన్ని పరిష్కారం అవక తప్పవు. ఏ [illegible] నయినా సరే అయ్‌క్యరాజ్య సమితి పెద్ద[illegible] పరిష్కారానికి తోడ్పడేందుకు సిద్ధంగా ఉంది. కేవలం చర్చలకి కేంద్రం మాత్రమేకాక రాయబారాలకి సాధనంగా కూడా సమితి సహాయం చెయ్యగలదు

మన ప్రపంచాన్ని సైనికంగా, రాజకీయంగా విభజించే దృక్పథాలు పాతపడిపోతున్నాయని నా అభిప్రాయం.

సమాజంలోని ఆర్థిక, సాంఘిక సమస్యల విషయమై మనం ఇంకా శ్రద్ధవహించాలి. దేశాల మధ్య ఆర్థిక తారతమ్యాలు తగ్గాలి. సమితి అధ్వర్యంక్రింద అన్ని రాజ్యాలకీ తమతమ బాధ్యతలను అర్థం చేసుకునే వాతావరణాన్ని సృష్టించవచ్చు; వివిధ ప్రాంతాలవారి మధ్య సహకారం పెంపొందించవచ్చు.

ఈ రంగాలలో సమితికి ఉండవలసినన్ని వనరులు లేవు. తక్కిన రంగాలలో పెద్దరాజ్యాలు ఖర్చు చేసేటంత ఇక్కడ ఖర్చు చెయ్యటంలేదు. మానవజాతిని ఎదుర్కొనే సమస్యలన్నిటినీ అయ్‌క్యరాజ్యసమితి నాయకత్వంలో పరిష్కరించవచ్చునని నేను నమ్ముతున్నాను. ఈ విధంగా ప్రపంచం వివిధ విరోధ వర్గాలుగా చీలిపోకుండా ఉండేందుకు సమితి సహాయపడగలదు.

ఆర్థికాభివృద్ధికి సంబంధించినంతవరకూ అమెరికా పెద్ద విజయాలనే సాధించ గలిగిందనవచ్చు. ప్రజాస్వామ్యం కూడా— యూరోప్‌లో వలె కాక— క్రిందనుంచి వచ్చే విప్లవంవల్ల కాని, తిరోగమన వాదాలవల్ల కాని దెబ్బతినలేదు. అయితే, రెండు ప్రపంచయుద్ధాలు, ఒక పెద్ద ఆర్థిక ప్రమాదం, అమెరికాలో అభివృద్ధి ఎప్పుడూ ముందుకే సాగదేమోనన్న సందేహం కలిగించాయి. ఇతర ప్రాంతాలలోని రాజకీయ, సాంఘిక పరిణామాలు ఈ దేశం ప్రజలకి ఆందోళన కలిగిస్తున్నాయి. 1776లో వలస తత్వాన్ని ఎదిరించిన వారి వారసులే నేడు స్వతంత్రోద్యమాలను చూసి బెదురుతున్నారు.

కొత్త పరిస్థితులను పాత వైఖరులతో ఎదుర్కొనటం బాధాకరంగా ఉంటుంది. అన్నిటికీ 'గూండా'లే బాధ్యులని చెప్పుకుంటే మనశ్శాంతి కలుగుతుందేమో కాని నిబ్బరం మాత్రం తగ్గుతుంది. ఆయుధాల ఉత్పత్తి విపరీతంగా పెంచి కూడా లాభంలేదు. అణ్వస్త్రాలతో సైన్యాల ప్రాముఖ్యత తగ్గింది. ఒక్క అణ్వస్త్ర యుద్ధంలో సాధించగలిగిన 'లాభాలు' చరిత్రలో కలిగిన అపజయాలన్నిటివల్లా వచ్చిన నష్టంకన్నా ఎక్కువగా ఉంటాయేమో ! ఇటువంటి యుద్ధం రాకుండా చూడటమే ప్రస్తుత రాజకీయ విధానాల కర్తవ్యం. కొన్ని తరాల క్రితం యుద్ధానికి దారితీసే పరిష్కారాలెన్నో నేడు యుద్ధ భయంవల్ల స్వీకరిస్తున్నారు

ఏమి జరుగుతున్నదంటే, ప్రజలలో ఉజ్వల భవిష్యత్తుకి సంబంధించిన చైతన్యం ఏర్పడుతున్నది. ఈ ధోరణిని బలపరచటమే అమెరికా కర్తవ్యం. ఆర్థికాభివృద్ధి ఫలాలు అందరికీ న్యాయంగా చేకూరాలి.

ప్రస్తుతం పరిస్థితులలో ఏ ఒక్క దేశమూ తను పూర్తిగా స్వతంత్రం కలదని నమ్మటానికి వీలులేదు. ఈ అణ్వస్త్ర, అంతరిక్ష యుగంలో జీవించగలగాలంటే జాతీయ, సాంస్కృతిక విభేదాలను మరచిపోయి మానవ సమాజ వికాసానికి అందరూ కృషి చెయ్యాలి.

కల్పిత జగత్తులో విహరించే కొందరు, అయ్‌క్యరాజ్యసమితి అంటే ఏదో అంతర్జాతీయ శాంతి, భ్రాతృ భావాలను పెంపొందించే ఆదర్శ సంస్థగా వూహిస్తారు. ఇది పొరపాటు అని నా నమ్మకం. అయ్‌క్యరాజ్య సమితి ఆదర్శ ప్రపంచానికి చెందినదికాదు. ఈ ప్రపంచానిదే. ఈ ప్రపంచపు ప్రజల జీవితాలను వికసింపచేసేదే. ★




విడిదిలో పెళ్ళికొడుకు అలిగి కూచున్నాడు. మగపెళ్ళివారు భోజనాలకు రామని భీష్మించుకు కూర్చున్నారు.

పెళ్ళికొడుకు—తల్లి చీర చెంగుతో ముక్కు తుడుచుకుంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకున్నది మొహమంతా కందగడ్డ చేసుకుని. పక్కనే కూచున్న ఇద్దరు కూతుళ్ళు ఏవో చెప్పుతూ అగ్నికి ఆజ్యం పోస్తున్నారు.

ఉదయం పది-గంటల ఏడు నిముషాలకు మాంగల్య ధారణ జరిగింది. ఆ తర్వాత ఆరంభ మయిందీ ప్రచ్ఛన్న యుద్ధం !

కన్యాదాత వెంకయ్యపంతులుగారు కాలు గాలిన పిల్లిలాగ తిరుగుతున్నారు పెళ్ళివారిని సమాధాన పరచాలని. అయిన ఖర్చు అవుతూ ఈ అల్లరి ఏమిటని ఆయన బాధ.

పెళ్ళి—ఎందిట్లో ఎవరో అన్నారుట .... "అందుకే సాంప్రదాయం చూసి చేసుకోవాలన్నారు. ఒక మంచీ మర్యాదా ఏమీలేదు. మొహం వాచినట్టు ఆ ఫలహారాలకు ఎగబడడ మేమిటి— తింటూ ఆ వంకలు పెట్టడమేమిటి'' అని.

'ఆడ పెళ్ళివారు ఇలాంటి మాటలతో అవమానం చేస్తారా' అని, మగ పెళ్ళివారు అలిగారు.

వెంకయ్యపంతులుగా రసలే ముక్కోపి ! అయినా మనిషిలో ఎంతో మార్పు కనిపించిందా సమయంలో. ఎర్ర పట్టుబట్ట కట్టుకుని తెల్లటి జరీ అంచు పట్టు ఉత్తరీయం మీద వేసుకుని విడిదికి బయలుదేరుతుంటే 'అసలే ఈయనది దుడుకు స్వభావం; లేనిపోని గొడవలు చేసి రసాభాసం చేస్తాడేమో'నని వెంట ఆయన తోడల్లుడు సుందర్రామయ్య కూడ వెళ్ళాడు.

వెంకయ్య పంతులుగారు నవ్వుముఖంతో ప్రాధేయ పూర్వకంగా వియ్యంకుడి చేతులు పట్టుకుని బతిమలాడారు.' 'ఎవరో ఏదో అన్నారని ఇలా భోజనాలు చెయ్యకుండా ఉండటం న్యాయమా చెప్పండి బావగారూ ! మేముగా ఏమయినా తెలియక పొరపాటున చేసి ఉంటే చెప్పండి; క్షమాపణ వేడుకుంటాను.'

ఆయనంటున్న మాటలకు లోపలినుంచి వియ్యపురాలి పక్కన కూచున్న బంధువు దగ్గర మంచి సమాధానం వచ్చింది.

'ఎవరో ఏదో అంటే మా కెందు కింత బాధ ! పెళ్ళికూతురికి స్వయాన అమ్మమ్మట ఆ మాటలన్నది. మేమేమీ తిండికి మొహంవాచి రాలేదు మా మంచీ మర్యాదా మీచేత పరీక్ష చేయించుకోటానికి రాలేదు !'

'ఆవిడ పెద్దది. తొందరలో ఏదో అని ఉంటుంది. ఆమె మాటలు అంతగా పట్టించుకోవాల్సిన పనిలేదు. ఇక భోజనాలకు లేవండి బావగారూ ! 'విస్తళ్ళు వేశారు. వడ్డించడానికి సిద్ధంగా ఉన్నారక్కడ. మీరు లేవాలి ఇక.' వెంకయ్య పంతులుగారు ప్రాధేయపడ్డారు.

వెంట వచ్చిన సుందర్రామయ్యకు తను ఎన్నడూ చూడని సౌమ్యత ఆయనలో చూస్తుంటే ఆశ్చర్యం వేసింది.

'అనే మాటలు అనేసి— తొందరలో అన్నది— పెద్దది— అంటే ఎలాగండీ, మా కెంత కష్టంగా ఉందో ఆలోచించారా మరి!' వరండాలో స్తంభానికి ఆనుకుని కూచుని పుగాకు చుట్ట చుట్టు కుంటున్న ఒక బంధువు ఎదురుప్రశ్న వేశాడు.

ఆ విడిదిలో ఉన్నవాళ్ళు మూడు వంతు లకు పైగా ఉదయం ఏడుగంటలనుండీ అప్పటి దాకా ఆడపెళ్ళివారికి కబుర్లమీద కబుర్లు పెట్టి తెప్పించుకున్న ఇడ్లీ — ఉప్మా, కాఫీ నాలుగైదు సార్లయినా ఖాళీ చేశారు.

ఇదంతా చూసి ఆ ముసలావిడకు వళ్ళుమండి పోయి, ఆ మాట అన్నది, అయిదోసారి కాఫీ గుం డిగ పట్టించుకు పోదామని వచ్చిన ఆమె పెవేట్సుగా!

విడిదింట్లో ఒకవేపుగా మంచంమీద కూచుని స్నేహితులతో ముచ్చట్లాడుతున్నాడు పెళ్ళికొడుకు.

'రేడియో అడగరా మీ మామను.'

'రేడియోకంటె— ట్రాన్సిస్టరడగరా ఇప్పుడు గాకపోతే ఇంకెప్పుడిస్తాడు?' అని సలహాలిస్తున్నారు మిత్రులు.

'ఆయన్ని మనవేపు రానీ అసలు' పెళ్ళికొడుకు సందేహం వెళ్ళబుచ్చాడు.

'ఓరి చవటా! అప్పుడే నీళ్ళుగారి పోతా వేమిరా! ఆయన వచ్చి 'లేవోయ్ భోజనానికి' అని అనగానే లేచి ఆయన వెంట పరిగెత్తక. కొంచెం బెట్టుచెయ్యి. మిగత సంగతి మేము పూర్తి చేస్తాము అని ధైర్యం చెప్పారు మిత్రులు. పెళ్ళికొడుకు అంగీకార సూచకంగా బుర్ర ఊపాడే గాని తన వయుపువాళ్ళు ఒక పట్టాన తెగనిచ్చేటట్టు కన బడలేదు వ్యవహారం.'

మామగారు ఒంటరిగాడయిపోయినాడు. ఆయన బతిమలాడుతున్న కొద్దీ, తీరుబడిగా కూచుని విజృంభిస్తున్నారు ఎవరికి తోచినట్టు వాళ్ళు.

వెంకయ్య పంతులుగారు క్షణక్షణానికి సహనం కోల్పోతున్నారు. అయినా తప్పదు! ఇటు వంటి సమయాల్లోనే ఓర్పు, నేర్పు అవసరం! ఇదే తను తలపెట్టిన శుభకార్యం! అంతా సవ్యంగా జరిగిపోయిందనుకుంటే, సరీగా భోజ నాల ముందు పేచీ వచ్చిపడింది. అసలు వాళ్ళని మాట్లాడనివ్వకుండ పక్కలన ఉన్నవాళ్ళు తలా ఒక మాట విసురుతున్నారు. వియ్యంకుడు ఎటూ చెప్పలేక గుంజాటన పడుతున్నాడు.

పెళ్ళి చేసిచూడు; ఇల్లు కట్టిచూడు అన్నా రందుకే! వేలకువేలు డబ్బు ఖర్చయినా వచ్చే మాట రానేవస్తుంది. వెంకయ్య పంతులుగారి వివాహంలో తనవాళ్ళు ఇంతకన్న ఎక్కువ అల్లరే చేశారు. పాపం! ఆయన మామగారు ఆరితేరిన అనుభవజ్ఞుడు కావడంచేత అన్నీ సునాయాసంగా సమర్థించుకుపోయాడు. ప్రతిదానికి అడుగడు గునా వంకలు పెట్టటమే మగపెళ్ళివారు. అప్పుడు జరిగిన దానికంటే ఇప్పటి పరిస్థితిలో ఎన్నో రెట్లు నయం! ఆ విషయం జ్ఞాపకంవచ్చి ఆయన కోపాన్నంతా దిగమింగుకుని వియ్యం కుడిని, ఆయన బంధులవును సమాధాన పరచాలని శతవిధాల ప్రయత్నం చేస్తున్నారు.

ఒక అరగంట జరిగిందీ వరసన. ఎంత సేప యినా, మళ్ళీ మొదటికే వస్తున్న దీ వ్యవహారం! భోజనాలకు లేచే వాతావరణం ఎక్కడా కనిపించ లేదు. ఆలస్యం జరుగుతున్నకొద్దీ విడిదిలో ఏం జరుగుతున్నదో తెలుసుకుందామని పెళ్ళివారింటి నుంచి ఒకరి తర్వాత ఒకరు చేరుకుంటున్నారు.

'సరే మీరంత పట్టుదల పడితే ఏం చెయ్యగలను చెప్పండి. నేనూ ఇక్కడే కూచుంటాను' అని వెంకయ్య పంతులుగారు వియ్యంకుడి పక్కనే కూచు న్నారు.

ఆయన తోడల్లుడు సుందర్రామయ్యకు మాత్రం సహనం నశించి అరికాలిమంట నెత్తికెక్కింది. 'వీళ్ళు మనుషులా లేక కారణ జన్మలయిన రాక్షసులా' అనిపించిందాయనకు.

వెంకయ్యపంతులుగారు కూచోవడం గమ నించిన ఒక బంధువు 'మీరు అనే మాటలు బాగానే ఉన్నాయి గానీండి; తప్పంతా మాదే నంటారు ఇంతకీ!' అన్నాడు అయిదోసారి పుచ్చుకున్న కాఫీ టిఫీను పీకదాకా ఎగదన్నుతుంటే తాపీగా కంఠం సరిజేసుకుంటూ.

ఇంక లాభం లేదనుకున్నాడు సుందర్రామయ్య. కూచున్న వాడల్లా దిగ్గున లేచి 'అన్నమాటలేవో అన్నాము. కావాలని మేమే ఆ ముసలమ్మచేత అని పించాము. సరా!.... ఇప్పుడు మీరు భోజనాలకు లేస్తారా లేవరా! ఒక్కటే మాట. రెండు నిము షాలే టయిము' అన్నాడు హెచ్చు—స్వరంతో.

ఆయన ముఖ కవళికలు చూసి అక్కడ జేరిన అందరూ హడలిపోయారు. అప్పటిదాకా ఒకళ్ళ కొకళ్ళు సంబంధం లేకుండా మాట్లాడుకుంటున్న మాటలతో రణగొణ ధ్వనిగా ఉన్న విడిది నిశ్శబ్దంగా అయిపోయింది.

ఆడవాళ్ళంతా గజగజలాడారు. పెళ్ళికొడుకు గుండెల్లో రాయిపడింది. వెంకయ్య పంతులుగారు పరిస్థితి అర్థం చేసుకుని నవ్వుతూనే తోడల్లుని సమీపించి 'తొందరపడకు తమ్ముడూ!' అన్నారు.

'మీరూరుకోండి అన్నగారూ! క్షమించండి. అంతకంటే ఏమీ చెప్పలేను!' అని కోపంతో ఊగిపోతూ వెంకయ్యపంతులుగార్ని తప్పించుకుని రెండడుగులు ముందుకు వేసి 'అందరి మర్యాదా మంట కలసిపోకముందే — భోజనాలకు నడవండి— ఏమండి వియ్యంకుడుగారూ చూస్తారేం?.... ఒరేయ్ వెంచయ్యా! భజంత్రీలను రమ్మను— మేళం చెయ్యమను...' ఆజ్ఞలు జారీచేశాడు సుందర్రామయ్య.

'లేవలేకపోతే ఏం జేస్తాడో!' అని ఒకమూల నుంచి అన్న మాటలు ఆయన చెవుల్లో పడ్డాయి.

'నేనేం చేస్తానో, చేయిస్తానో మీతో చెప్పి చేయవలసిన అవసరం నా కేమీలేదు. మూర్ఖంగా ప్రవర్తించక హృదయమున్న మనుషులుగా ప్రవర్తించండి!' గర్జించాడు.

ఇంతలో వెంచయ్య అందించిన సందేశం ప్రకారం బాజా భజంత్రీలు వచ్చి విడిదిముందు నిలి చారు.

ఆశ్చర్య మేమిటంటే వెంకయ్య పంతులుగారు కూడ తన తోడల్లుని వేపు చూడడానికి సాహ సించలేకపోయారు. అప్పటిదాకా కుడితిలో పడిన ఎలుకలాగా కొట్టుకుంటున్న వియ్యంకుడు లేచి లోపలికి వెళ్ళి 'నే చెబితే విన్నారుటమ్మా!.... సవ్యంగా సాగిపోతున్న దానికి ఒక అడ్డుపుల్ల వేస్తిరి. ఇప్పుడు అవమానం—పాలయ్యేది వాళ్ళా మనమా! అసలే పల్లెటూరు ఇది. పదిమందిని పిలిచి మనమీదకు ఉసిగొలిపితే ఇక్కడ మన వరువేంకావాలి!.... ఆయన చూడు— వీరభద్రుడి అవతారం ఎత్తాడు!'' అని మొత్తుకున్నాడు. దానితో ఎవరి మటుకు వాళ్ళు తెలివి తెచ్చుకుని లేనిపోనిది భలానా వాళ్ళ పెళ్ళికి వెళ్ళి చావు దెబ్బలు తిని వచ్చారంటూ — కలగబోయే అపనిందకు జంకి— భోజనాలకు వెళ్ళడానికి సిద్ధపడ్డారు.

సుందర్రామయ్య విడిదంతా కలియ చూశాడు. అందరూ లేచి సిద్ధ మవుతున్నారు గాని పెళ్ళి కొడుకు మాత్రం నడిమంచంమీద కూచున్నాడు తిష్ఠవేసుకుని.

'ఏం మిష్టర్! లే! లే! వాళ్ళంతా బయలు దేరారు. ఇప్పటికే కాలాతీత మయిపోయింది' అన్నాడు సుందర్రామయ్య పెళ్ళికొడుకు దగ్గరకు వెళ్ళి.

ప్రళయం సరాసరి తనమీదికే వచ్చినందుకు ఆలోచించే వ్యవధికూడ దొరక్క, లేచీమని లేచి నుంచున్నాడు పెళ్ళికొడుకు పక్కనున్న స్నేహి తులు నొక్కిపెడుతున్నా వినకండా; వూడిపోతున్న మధుపర్కం సరిజేసుకుంటూ: 'అబ్బే నాదేముందీ, పదండి' అన్నాడు.

అందరినీ కూడగట్టుకుని పెళ్ళివారింటికి చేరేలోగా ఈ వార్త పాక్కిపోయింది పెళ్ళి పందిట్లో. సుందర్రామయ్య అంతపని చెయ్యగలిగాడా! అనేదే ప్రతివారిని ఆశ్చర్యపరచిన విషయం.

భయంతో భోజనాలకు బయలుదేరారే గాని మగ పెళ్ళివారి కిది అవమానకరంగానే తోచింది. పౌరుషం పెరిగింది. భోజనాల దగ్గర గొడవ చేసి ప్రతీకారం తీర్చుకోవాలని ఎవరి మటుకు వారు నిశ్చయించుకున్నారు. కొంతమంది బయటికే అనుకున్నారు. అవి మెల్లిగా పాకి మగపెళ్ళివారి కంటె ముందుగానే వెంకయ్యపంతులుగారింటికి చేరినయి.

ముహూర్త బలం మంచిది కాదన్నారు.

అంతా సవ్యంగా అయిపోయిందని సంతోషి స్తుంటే, ఆఖర్న ఈ కొసరు ఏమిటని బాధ వ్యక్తం చేశారు.

సాంప్రదాయం అవీ చూడకుండ సంబంధం కలిపితే ఇట్లాగే ఉంటుందని వ్యాఖ్యానించారు కొందరు.

'ఇటువంటి వాళ్ళతో ఎట్లా నెగ్గుకు వస్తుందో పాపం జానకి!' అని పెళ్ళికుమార్తె మీద సాను భూతి చూపించారు.

సుందర్రామయ్య ఇంట్లో వాళ్ళందరికీ ధైర్యం చెప్పాడు: 'మీరేం భయపడద్దు మీ పని మీరు కాని వ్వండి' అన్నాడు.

వెంకయ్యపంతులుగారు మాత్రం ''లేనిపోని గొడవ ఏమిటిది సుందర్రామయ్యా!'' అని చేతులు పట్టుకున్నాడు ఎటూ పాలుపోక.

'మీరేం భయపడకండి. అంతా సవ్యంగానే జరిగిపోయేట్లు చూచే భారం నాది' అన్నాడు సుంద ర్రామయ్య.

అల్లరి చేద్దామనుకున్న వాళ్ళెవరూ నోరెత్త లేదు భోజనాల దగ్గర. దానికి కారణం సుందర్రా

43—వ పేజీ చూడండి

**వనితాలోకం :**

# బొంబాయిలో పొరుగుపిల్లలతో పాట్లు

**'సత్యభామ'**

ఇది వాల్గు సంవత్సరాలనాటి మాట. మా వారు బొంబాయిలో ఉద్యోగం చేస్తున్న రోజులు, నాకు చాల మొహమాటం, ఇంట్లో అందరిమీదా పోట్లాడగలను కాని, మాటపోటీ మాటలన్నప్పటికీ, బయటి వారితో ఒక్క మాటయినా వ్యంగ్యంగా అనడంచేతకాదు. వాళ్లు అని పోయిన తరువాత మనసులో బాధపడడం, వాళ్ళు చేసే పనులకు లోపల లోపలే ఆగ్రహించడం— ఆ సమయానికి ఎదురుగా మా వారు కన్పిస్తే విసుక్కోవడం నా స్వభావం, అదే నేను చేయగలిగింది. నా అదృష్టం, మా వారు చాల ఓర్పు కలవారు కాబట్టి ఇంకా నన్ను ఇంట్లో ఉండనిస్తున్నారు.

నేనూ చదువుకున్నాను. స్కూలు ఫైనలు రెండుసార్లు డింకీకొట్టి కూడా— చాలా పెద్ద చదువులు చదువుకున్నాననుకున్న మా పొరిగింటి సోదరికంటే ఎక్కువే చదువుకున్నాను. యూనివర్సిటీ వారు నాకు ఒక ఎం. ఏ. డిగ్రీ ఇచ్చారు. కాని ఫ్యాషనాలకం చూసిన బొంబాయి ఆంధ్ర వనితలు కొందరు నమ్మరు. టిప్‌టాప్‌గా డాబుగా వేషం వేసి తయారయ్యేవారికి సీదా సాదాగా ఉండే నన్ను చూస్తే హేళన. అమ్మలక్కలందరితోటి కూర్చొని ఇచ్చకాలాడటం నాకు చేతకాదు, పైగా నా కిష్టం కూడాలేదు. అందుకనే కాబోలు ఈ కూటమిలో నేను ఇమడ లేకపోయాను. నేనంటే వీరందరికీ ఒక విధమైన తిరస్కార భావం.

అసలు ఇంతకూ చెప్పవల్సిందేమిటంటే నా అలుసు కనుక్కున్న ఈ వనితలు చేసిన పని నాకు చాల కష్టమనిపించేది.

సాయంత్రం నాలుగు కొట్టేసరికల్లా— ఒక్కో రోజు మూడింటికే— మా ఇంటికి ఐదారుగురు పిల్లలు వచ్చేవారు, మా పిల్లలిద్దరితోటీ ఆడుకోడానికి, మేమున్న ఇంటికి అంతా ఫర్లాంగు దూరం లోపలే నాలుగు తెలుగు కుటుంబాలున్నాయి. ఈ పిల్లలు వాళ్ళపిల్లలే. తెలుగు పిల్లలెవరూ మన పిల్లలికి ఆడుకోడానికి జతకాలేదే అనుకుండే నాకు బొంబాయికి వెళ్ళిన కొన్నిరోజులకు ప్రారంభమైన ఈ పిల్లలరాక మొదట్లో నాకు చాలా సంతోషం కలిగించింది. అందరూ కలిసి ఆడుకుంటుంటే నాకు హాయిగా ఉన్నప్పటికీ— పోనుపోను— చాలా బాధాకరంగా పరిణమించింది. తమ వినోద విలాసాలకు అడ్డంలేకుండా ఉండాలన్న ఉద్దేశంతో ఈ పసిపిల్లల్ని ఇంత వేగం బయటకు పంపేస్తున్నా రన్న అసలు విషయం తెలిసినప్పుడు నాకు కలిగిన ఆశ్చర్యానికీ, బాధకూ అంతులేదు. ఇది అర్థమవడానికి నాకు నెలరోజులు పట్టింది. అదయినా కాకతాళీయంగా ఒకనాటి సంభాషణలోనే.

ఓ రోజు మా పిల్లలు మరిద్దరూ కలిసి వాళ్ళింటికి వెళ్ళారు— సాయంత్రం ఆరుగంటలదాకా మా ఇంట్లో గంతులు వేసిన తర్వాత.

"ఒరేయ్ ! బజార్లోకి వెళ్లి ఆడుకోండి.... చూశారా పిన్నిగారూ, ఇలా పిల్లలను మన ఇంటి మీదకు తోలితే ఎలా చెప్పండి." అన్నారుట ఆ పిల్లల తల్లి చూడవచ్చిన మరో మహిళతో, నాకంటే సున్నిత హృదయం కలిగిన మా వాడు బిక్క మొగంతో ఇంటికి వచ్చిచేసిన ఫిర్యాదు ఇది !

"ఎప్పుడూ ఇంతేనమ్మా, ఎప్పుడైనా వెళ్ళితే ఫోఫో అంటూ మమ్మల్ని ఇంట్లో నుంచి తరిమివేస్తారు. వాళ్ళేమో మనింట్లో యెప్పుడూ ఆడుకుంటారు కదమ్మా ! మమ్మల్ని మాత్రం వాళ్ళ ఇంట్లో ఒక్కక్షణం కూడా ఆడుకోనివ్వరు." మా పిల్లలు ఏమైనా గోలచేస్తున్నారేమోలే అనుకొని సరిపెట్టుకున్నాను చాలసార్లు.

ఓ రోజు 7 గంటలై చీకటి పడిందికాని మా ఇంటికి వచ్చిన ఇద్దరు పిల్లలు ఇంటికివెళ్ళే ఆలోచనలో లేకపోవడం చూచి, నేనే ఇంటికి వెళ్ళమన్నాను వాళ్ళ పెద్దవాళ్ళు గాభరా పడతారేమోనని. వాళ్ళు చెప్పిన సమాధానం వింటే నాకు చాల ఆశ్చర్యం వేసింది. "మా అమ్మగారు ఎక్కడికో వెళ్తోందిట. అందుకని మీ ఇంట్లో 7—30 దాకా ఆడుకొని రమ్మన్నారండీ. అంతకులోపు రావద్దన్నారు." అన్నది వాళ్ళ సమాధానం ఎప్పుడడిగినా ఇదే సమాధానం, ఇదే తంతు రోజూ. మా పిల్లలు ఎప్పుడో ఒక రోజు వెళ్ళి పదినిముషాలు కూర్చుంటే ఫోఫో అన్న ఆ సోదరీమణి తన పిల్లలకు ఇలాంటి సలహా, ఆదేశం ఇవ్వడం ఏమి సబబా అని ఆశ్చర్యపోయాను.

పెళ్ళయిన వెంటవెంటనే పుట్టుకువచ్చిన ఇద్దరిపిల్లలవల్లా, తాము సరిగా సంతోషంగా అనుభవించలేక పోయామని బాధపడుతున్న ఆ యువతి, సాయంత్రం భర్త ఇంటికి వచ్చేసరికి పిల్లల్ని పైవాళ్ళ ఇంటికి పంపించి, ఇంట్లో ఏకాంత, ప్రశాంత వాతావరణం సృష్టించి భర్తను ఆహ్వానిస్తుందట. అందుకనే నాల్గు గంటలకల్లా తమకు ముస్తాబు, పిల్లలకు బహిష్కరణ !

ఒక్కమాట. తెలుగుదేశం వదిలి దూర ప్రాంతాల్లో ఉండే మనము ఒకళ్ళొకళ్ళకు సాయం చేసుకోవాలి. కలుపుగోలుతనంగా ఉండాలి. అవసరానికి ఆదుకోవాలి అన్న విషయాల్ని మనసారా విశ్వసించి, ఆచరించవలసిన విషయం నేనెప్పుడూ మరువను. మరువకూడదు కూడాను. కాని అల్లా అని నా మంచితనం ఆసరాగా, నోరులేని నా బోటి

ప్రేయసీ! ఏమినీ అందము?...
నల్లని కాటుక కళ్లు... ఎర్రనిపెదవులు
బుగ్గపై చిన్నిపుట్టుమచ్చ.. ఈ అర్ధరాత్రి
చీకటిలా నన్ను పిచ్చివాణ్ణి చేస్తున్నాయి!

ఒకానొక మహారచయిత నవలలోని ఒక సన్నివేశానికి చిత్రీకరణ—
(బొమ్మ బాగా లేదని తిరిగి ఇచ్చేశాడు)

## వంటలు-చిట్కాలు

మనమందరము రోజూ వండుకొని రుచిగా పదార్థములు ఇంట్లో అందరికీ పెట్టవలెనని ఆశించుతాము. మన వంటలు, పిండి-వంటలను అందరు నిండుగా తిని బాగున్నదంటేనే మనకు తృప్తి. అనేకవిధముల పిండి వంటల తయారించువిధములు మీరు పత్రికలలో చదువుకొని, మీరు కూడ ప్రయత్నించి తెలుసుకొంటూ ఉంటారు.

మనకు క్రొత్త క్రొత్త పిండి వంటలు తెలిసినా కూడ, కొన్ని విషయాలు తెలియవు. మన పూర్వీకులు ఉపయోగించిన కొన్ని ఉపయోగమైన విషయములు ఈ శీర్షికలో ఇస్తున్నాను. ఇవి గృహిణులకు ప్రతి రోజూ ఉపయోగంగా ఉండును. మీకు కొన్ని తెలిసి యుండవచ్చు; కొన్ని తెలియకపోవచ్చు. ఐనా అన్నీ అందరికీ తెలియవు కదా?

1. నిమ్మపండు రసము ఉపయోగించి తయారించు పదార్థములలో, తయారించిన పదార్థము వేడిగా నున్నప్పుడు నిమ్మపండు రసం పిండకూడదు. అలా పిండితే పదార్థం చేదై పోతుంది. తయారించిన పదార్థమును క్రింద దింపి వేడితగ్గిన తర్వాత నిమ్మపండు రసం పిండండి.

2. కాకరకాయ మున్నగు చేదైన కాయల చేదు తగ్గను, వాటిని బియ్యం కడిగిన నీటిలో కొంచెం సేపు, తరిగి వేసిఉంచితే వాటి చేదు పోవును.

3. మిరపకాయల రుబ్బితే, చేయి మంట ఎత్తుతుంది. మంట ఎత్తకుండ మంచినూనె పూసి, నబ్బువేసి కడుగుకోవచ్చు.

4. తీపి పదార్థములు తయారింప పంచదార జీరా తయారించునప్పుడు అందులో నున్న మురికి పోను, ఒక స్పూను పాలు పోస్తే, మురికి అంతా చేరి పైకి వచ్చును. దానిని సులభంగా గరిటతో తీసి వేయవచ్చు.

5. చిన్న ఉల్లిపాయల మీది తోలు తీయడం కొంచెం కష్టం. దానిమీద కొంచెం నూనె రాసి, కొంచెంసేపు ఎండలో పెట్టితే, తోలు తీయడం చాల సులభం.

—'జయశ్రీ'

## వనితా వాణి

### పెరటితోటల పెంపకం

"పెరటి తోటల పెంపకం" అను వ్యాసములో తెలిసికోవలసిన విషయములు పెక్కు గలవు.

గుంటూరు కల్యాణి (అప్పికట్ల)

* * *

ఈ విషయమై అందరి అభిప్రాయాలకు తగిన మార్గదర్శకమైంది వారి వ్యాసం. పాత అభిప్రాయాలను మార్చుకొని, విజ్ఞానం పెంపొందించు కొనుటకు ఈ వ్యాసం చాలా ఉపయోగం.

రుద్రి రమామణి (బెంగుళూరు)

2, 3 పత్రికల నుండి వనితాలోకంలో వ్యాసాలు ఉపయోగకరంగా ఉంటున్నాయి. ఇంకా విదేశీయుల ఆచార వ్యవహారాలను తెలిపే వ్యాసాలు ప్రచురిస్తే సంతోషం.

కె. పుష్ప పట్నాయక్ (ఎన్నారం)

### క్రీడారంగంలో స్త్రీలు

'క్రీడా రంగంలో స్త్రీలు' అనే వ్యాసం పత్రికకు క్రొత్తదనాన్ని తెచ్చింది. 'అన్ని రంగాలలో స్త్రీలు పాల్గొంటున్నారు.' ప్రస్తుత దేశరక్షణ సమయాలలో దేశంకోసం స్త్రీలు తీసుకోవలసిన శ్రమకు శక్తిని ప్రసాదించేవి క్రీడలు. విశ్వవిద్యాలయ స్థాయిలో, కళాశాలల స్థాయిలో ఆటల పోటీలలో స్త్రీలు మరింత ధైర్యంగా పాల్గొనడానికి అవకాశం కలిగింప జేయు వ్యాస రచయిత్రి బోడపాటి సుందరిగారికి నా హృదయపూర్వకాభినందనలు.

గంధం సంజీవని (రాజమండ్రి)

### అమెరికాలో....

నేను కూడ ఇంతకుముందు అమెరికా అనగానే, మన ఇండియా—భోజనము ఏమియూ ఉండదని భావిస్తూ ఉండేదాన్ని. కాని ఈ వ్యాసం చదివిన తరువాత నా అనుమానం తీరిపోయింది. అన్నపూర్ణగారు అక్కడ దొరుకు వస్తువుల గురించి చాలా బాగా వ్రాశారు.

కుమారి వనజ (అనకాపల్లి)

### వంటా - వడ్డనా

17—5—63 ఆంధ్రవారపత్రికలోని 'వంటా, వడ్డనా' వ్యాసం చాలా బాగుంది. మా ఆయనకు వడ్డించటమే చాతకాదు. మీ వ్యాసం చూచిన తరువాత వడ్డన బాగా నేర్చుకొన్నారు మా ఆయన. రోజూ చక్కగా కంచం పక్కన ఆకు వేసి, అందులో కూరా, అన్నీ వేసి చక్కగా మా ఆయన వడ్డించడం నేర్చుకొన్నారు. మా ఆయనలాంటి వాళ్ళందరికీ మీ పత్రికలోని 'వంటా — వడ్డనా' అనే వ్యాసం బాగా ఉపకరిస్తుంది.

మాలతీ రావు (తాతావగరం) ★

---

వారిని వారి పిల్లల సంరక్షణ భారం రోజూ సహించమని దౌర్జన్యం చెయ్యడం ఏం బాగుంది? నేనూ ఒక మనిషినేనని, నాకు పిసరంత రెస్టు అవసరమన్న విషయంతోటి సోదరీమణులకు అర్థం కాకపోతే— అయినా— విస్మరిస్తే ఏమిటి చెయ్యడం? చెప్పితే నమ్మరుకాని ఆదివారాలు, మరి పబ్లికు హాలిడేస్ వచ్చాయంటే పిల్లలందరూ మా ఇంటికి ప్రొద్దున్నే తయారు. కొన్నిసార్లు మా కాఫీలు కూడాకావు వాళ్ళు వచ్చేసరికి! అంత పెందరాళే పిల్లల్ని రెడీచేసి బయటికి పంపగల తల్లిదండ్రుల్ని అభినందించగల్గినా ఆ పిల్లల స్థితికి పాపం జాలితలపకుండా ఉండలేను ఆడి ఆడి అరిచిఅరిచి పన్నెండు గంటలకి ఇంటికి భోజనానికి వెళ్ళడం— మళ్ళీ వెంటనే మా ఇంటికి తయారు. పోనీయ్, అదయినా నెమ్మదిగా ఆడుకుంటారా అంటే ఇల్లు అదరిపోయేట్లు బొబ్బలు అరుపులు కుర్చీలు, బల్లలు రిపేరుకు వెళ్ళవలసిందే వాళ్ళగిరవాట్లకు ఇంటివాళ్ళకు అమృతాంజనం సీసా ఖర్చు కావలసిందే. ఎంత ఎండలు మండిపోతున్నా, మధ్యాహ్నం ఒక్క క్షణమైనా పడుకోడానికి వీల్లేదుకదా! వేసవి సెలవులు ఇచ్చారంటే సరేసరి. ఇక చెప్పవక్కరలే. మధ్యాహ్నం నిద్రపోయే అలవాటున్న మా పిల్లలు, పగలు నిద్రపోతే రాత్రికి అడ్డమవుతారనే భయంకొద్దీ బయటికి తరిమివేయబడే తక్కిన పిల్లలతోబాటు, ఆడి, ఆడి, అరిచిఅరిచి, సాయంకాలం 6 గంటలకే, నేను భోజనం పెట్టేలోపలనే పడి నిద్రపోవడం, ఇంట్లోనే కూర్చొని ఏమి నిర్వాకం చేస్తున్నావు, వేళ్టికి పిల్లలకు అన్నంకూడా వండిపెట్టలేవా? వాళ్ళు అల్లాపడి నిద్రపోతుంటే నని మా వారు నామీద కేకలు వెయ్యడం మామూలయిపోయింది నిద్రపోయిన బిడ్డల్ని లేపి అన్నంకాదు గదా కనీసం ఒకప్పు ఓవల్టిన్ తాగించడం కూడా, సాధ్యమయ్యేదికాదు. ఇల్లా తరచుగా జరగడం నా కన్నీళ్ళకు కారణం అయ్యేది. ఇది ఇలా ఉండగా పిల్లలతో కొట్లాటలు, పోట్లాటలు తీర్చలేక నెమ్మదిగా ఆడుకోండి అని మందలిస్తే ఇంటికివెళ్ళి కంప్లెయింట్లు, ఆ మర్నాడు మహిళామణులందరూ మనల్ని తూర్పారపట్టడం, బావుందంటారా! నిజంగా చెప్తున్నాను. అదృష్టవశాత్తు ఆ ఊరినుంచి బదిలీ అయింది కాబట్టి బ్రతికిపోయాను. లేకుంటే శారీరకంగా పడే బాధకంటే ఈ మానసికమైన యాతన పడలేక ఏ నాడో మా సొంత ఊరు చేరవలసి వచ్చేది. మాది వాల్తేరులెండి. (మా ఊళ్ళో పిచ్చాసుపత్రి ఉంది.) ★

అనుమాపా వారి

# అనురాగం

దర్శకత్వం
రామినీడు

నిర్మాతలు
టి. హనుమంతరావు
డి. సూర్యనారాయణ

ఆంధ్ర, సీడెడ్, మైసూర్
విజయ
రిలీజ్
వారిది

STUDIO
RoopKala

# చరిత్ర ధోరణి

## వి. ఎస్. అవధాని

చైనా కమ్యూనిజంలో దురాక్రమణ సహజంగా ఉన్నదనీ, రష్యా కమ్యూనిజమ్ గొర్రెపిల్ల వంటిదనే అభిప్రాయం మన దేశంలో కమ్యూనిస్టులలో, వారి అభిమానులలోనే కాక కాంగ్రెస్ అగ్రనాయకులలోనూ, ఇతర పార్టీల నాయకుల లోనూ కూడా తరతమ తేడాలతో కనిపించుతున్నది "పంచశీల", "సహజీవన" సిద్ధాంతాలను ఆమోదించిన చైనా భారతదేశంపై దండెత్తి రావడాన్నీ ఇండియా—చైనా తగాదాలో బహిరంగంగా చైనాను రష్యా బలపరచకపోవడాన్నీ ఇందుకు దాఖలాగా చెబుతున్నారు

ఇట్లా చెప్పేవారూ, ఈవిధంగా ఆలోచించేవారూ ఇటీవలి చరిత్రను మరచిపోయినారేమో తెలియదు వాస్తవానికి దురాక్రమణ అనండి లేదా కమ్యూనిజం వ్యాప్తి అనండి అది మాత్రం మార్క్సిస్టు సిద్ధాంతంలోనే సహజంగా ఉన్నది.

మార్క్సు లెనిన్‌ల దృష్టిలో ఈ ప్రపంచమంతా రెండే రెండు కూటాలు. ఈ రెండింటిలో ఒకదానికి మరొకటి అంటే పడదు. వీటి మధ్య సంఘర్షణ అనివార్యం—జరిగి తీరవలసినదే.

బోల్షివిక్ విప్లవం ప్రారంభంలోనే ఇట్లా ప్రకటించాడు లెనిన్ · పెట్టుబడిదారీ విధానమూ, బోల్షివిక్ సోషలిజమూ అనేవి రెండూ ఉన్నంత కాలమూ మనశ్శాంతితో మనం బ్రతకడానికి వీలు లేదు అంతిమ విజయం వీటిలో ఏదో ఒకదానికి మాత్రమే లభించుతుంది . . సోవియెట్ రిపబ్లిక్కో పెట్టుబడిదారీ విధానానికో భరతవాక్యం చెబుతారు

"విప్లవం ప్రపంచ పరివ్యాప్తం కావాలి. పెట్టుబడిదారుల ప్రయోజనాల కోసం మాత్రమే అంతర్జాతీయ సరిహద్దు లనేవి ఉన్నయ్. వాటిని బదాబదలుచేసి ప్రపంచ విప్లవంలో కార్మికులను ఏకం చేయవలసిన పవిత్ర బాధ్యత రష్యా నిర్వర్తించాలి."

అంటే రాజ్య విస్తరణకూ, దురాక్రమణకూ మార్క్సిజమ్ కొత్త అర్థం ఆపాదించుకున్నది. అంతేకానీ, రష్యాలోని కమ్యూనిజమ్ దురాక్రమణకు దిగదు. చైనాలో అమలు జరిగే కమ్యూనిజమ్ మాత్రమే. దురాక్రమణకు దిగుతుందనే వ్యాఖ్యానం మార్క్సిస్టు సిద్ధాంతాల ప్రకారమే చెల్లదు

కనుకనే "రాజ్యాల మధ్య నయితే సహజీవన విధానమును సహించవచ్చును. సిద్ధాంతాల మధ్య సహజీవనం వంటి దేమీ పనికిరాదు." అన్నారు రష్యా ప్రధానమంత్రి శ్రీ కృశ్చేవ్.

పైన వివరించిన లక్ష్యమును యుద్ధం ద్వారా మాత్రమే అంటే దేశాల సరిహద్దులను బదాబదలు చేయడాన్ని—సాధించాలన్న ప్రవతమేమీ లేదు. ఆయా దేశాలలోని ప్రజలచేత తిరుగుబాటు చేయించడం ద్వారా కూడా సాధించవచ్చును ఆ లక్ష్యమును.

మార్క్సిజమ్ అంటే ?

తెలిసో తెలియకనో మన దేశంలో చాలా మందికి ముఖ్యంగా కాంగ్రెసు నాయకులకు మార్క్సిజమ్ అంటే చాలా మోజు ఉన్నట్టు వారి పనులూ, ప్రకటనలూ, ప్రసంగాలూ విశదం చేస్తున్నయ్. దీనికి కారణాలు ఇట్లా చెబుతారు.

(1) అన్యుల పాలనలో దేశంలో దారిద్ర్యం ఎక్కువైనది. లేనివారిని కలవారు దోచుకోవడం ఎక్కువైనది. సమాజంలో ఆర్థిక ఎగుడుదిగుళ్ళు పోవడానికి మార్క్సు ప్రతిపాదించిన "వర్గ కలహము", "అదనపు విలువ" (సర్‌ప్లస్ వాల్యూ) సిద్ధాంతాలు బాగా ఉపయోగపడుతాయి.

(2) దారిద్ర్యం మనిషిని క్రుంగదీసినది. మనిషి దోవ తప్పడానికి దారిద్ర్యమే కారణం. దారిద్ర్య నిర్మూలనకు మార్క్సిస్టు పద్ధతులే శరణ్యం.

(3) సమాజ శ్రేయస్సు అంతా ఉత్పత్తి సాధనాలపై ఆధారపడి ఉన్నది. ఉత్పత్తి సాధనాలు కొంతమంది చేతులలో మాత్రమే ఉన్నంత కాలము సమాజ జీవితం బాగుపడదు. ఉత్పత్తి సాధనాలను సమాజ పరం చేయాలనే ఆర్థిక పరిష్కారం మార్క్సిజమ్‌లో మాత్రమే ఉన్నది.

(4) కొన్ని దేశాలను వలసలుగా జేసుకొని, వాటిని దోచుకున్న "పెట్టుబడిదారీ" విధానానికి విరుగుడు మార్క్సిజమ్

(5) ఆర్థిక పునర్నిర్మాణం ప్రాతిపదికగా వర్గ సంస్కరణ సాధించాలనే సిద్ధాంతం కనుక మార్క్సిజమ్ వాంఛనీయం.

కారణాలు ఏమైనా ఈ రకం భావాలు నాయకులలోను, మేధావులలోనూ గూడు కట్టుకున్న కారణాననే అడపా దడపా అంతర్జాతీయ రాజకీయాలలో కమ్యూనిస్టు—సోషలిస్టు రాజ్యాలను బలపరచడమూ, తదితర రాజ్యాలను గొంతెత్తి ఖండించడమూ జరిగినది. ఇదొక ఫాషన్ అయినది. మార్క్సిజమ్‌లోని "ఆర్థికత" తమాషా అట్టిది. అంతేగానీ తెలియక ఏవిధమైన వ్యామోహంలో పడ్డామనడానికి ఆధారంలేదు.

"మార్క్సిజమ్" ఒక్కటే పేదలను ఉద్ధరించే సిద్ధాంతమా ? అసలు మార్క్సిజమ్ ద్వారా పేదల ఉద్ధరణ ఎంతవరకూ జరుగుతుందీ ? వర్గ కలహం ద్వారా మాత్రమే అభ్యున్నతి సాధ్యమా ? "అదనపు విలువ" (సర్‌ప్లస్ వాల్యూ) అంత ప్రమాదకరమైనదా ?—అభివృద్ధికి నిరోధకమైనదా ? మార్క్సు వూహించినట్లు ఏ దేశంలోనైనా, ఎప్పుడైనా "రాజ్యాంగం"—ప్రభుత్వం వాడిపోయే అవకాశం ఉన్నదా ? అనే

—41 వ పేజీ చూడండి




"అబ్బ కదలకండి బొట్టెట్టుకోవాలా ?"

# కాశ్మీర్ బొకె టాల్క్‌తో గంటలుతరబడి సువాసనగా తాజాగావుండండి

అత్యద్భుతమైన, నాణ్యమైన కాశ్మీర్ బుకె కాన్కలు ఒక సౌందర్య టాల్క్... ఒక బేబీ పౌడరు

పూల గుచ్ఛంలోనికి చొబ్బినట్టుగావుంటుంది, కాశ్మీర్ బుకె టాల్క్ యొక్క చల్లని, పూలరేకు వంటి మెత్తదనాన్ని అనుభవిస్తే. వొళ్ల అంతా రాసుకోనండి, నవ వసంతపు ఘుమఘుమలతో రాజిల్లుతారు.



శిశువును సంతోషంగా హాయిగా వుంచండి! కాశ్మీర్ బుకె ప్రతి యితర ప్రత్యేక బేబీ పౌడరువలె మెత్తగా, సున్నితంగా వుంటుంది. మీ ఇద్దరూ ఉపయోగించదగల ఒకే పౌడరు అందు బాటులో వుండటం ఎంత మేలు!




# కాశ్మీర్ బొకె

పురుషులు వాంఛించే సువాసనగల టాల్కం పౌడరు

CB-8-19 TEL.

# మాటర్ హార్న్ లోయ ఛాయల్లో హత్య!

## 'హ్యుబెర్ట్ కేగి' (బెర్న్-స్విట్జరాండ్)

"ఎవరూ ? హెర్ కేగేనా ? బాబూ ? నా కర్జంటుగా— మీ సాయం కావాలి. ఉన్నట్టుండి రాగలరా ? ఆల్ప్స ప్రాంతంలో ఓ అమెరికన్ బాలిక హత్యచేయబడింది మెటర్‌హారన్ నుంచి చాలా దగ్గరే ! ! హత్యాకాండని నే నెప్పుడూ పరిశోధించలేదు మీలాంటి అనుభవజ్ఞుని సహాయం ఉంటే మంచిది......"

ఫోనులో గొంతు చాలా ఆయాసంగా, ఆరాటంగా వినబడింది; దుడుకు ప్రవాహంలా మాటలు ఫోనులోంచి వచ్చాయి. అవతలి గొంతు నాకు పరిచయంలేనిదేంకాదు. బెరిన్ పోలీసు హెడ్ క్వార్టర్స్ నుంచి 'అతను' నా సహాయాన్ని అర్థిస్తున్నపుడు కాదనకుండా వెళ్ళడం నా ధర్మం.

ఫోనులో మాట్లాడింది కాన్స్టేబుల్ జాగర్ అతను చెప్పేది అతనికే అర్థంకాని స్థితిలో చెప్పాడు. చెప్పడంలో కంగారు—పడిపోయాడు ఒక అమెరికన్ అమ్మాయన్నాడు. కాదు; ఇద్దరన్నాడు— అక్కడన్నాడు; ఇక్కడన్నాడు— హత్య అన్నాడు—అసలు హత్యచేయబడింది ఒకళ్ళో, ఇద్దరో తేలనే తేల్లేదు. చివరికి అసలు హత్య లేక హత్యలు ఎప్పుడు, ఎక్కడ, ఎలా, ఎందుకు జరిగాయో తెలిసేలా చెప్పలేదు.

కానీ, అమెరికన్ యువతి, పాస్‌పోర్టు, అర్జంటు— అనే ముక్కలు మాత్రం బోధపడ్డాయి. కాల్‌ప్రెటన్‌కు రైల్లో గమ్మున బయలుదేరాను. 'ఈ' జరిగిన సంఘటన 1932 వేసంగినాటిదైనా, నిన్న జరిగినంత చక్కగా నాకు గుర్తుంది. ఆనాడు నాలో పెరిగిన పట్టుదలే దాని క్కారణమై ఉండవచ్చునేమో ! ! నేను అత్యంతగా ప్రేమించే— నా మాతృదేశం స్విట్జర్లండ్‌లో జరీన్ ఐబర్‌ప్రాఫ్ హత్యగావింపబడడంవల్ల నాలో కోపం పట్టుదలగా మారింది.

అదంతా ఓ నాటి రాత్రి ఆరంభం అయింది

*  *  *

సూర్యరశ్మికి ఎర్రగా కంది, వాడిపోయిన ముఖంతో ఓ అందమైన అమెరికన్ అమ్మాయి— ఎర్రని, పల్చని, చక్కని టెరిలిన్ గౌను ధరించి— విస్ప (ఒక ఊరు)లో అందమైన చక్కని ఆల్పైన్ గ్రామంలో మాంట్ సెర్విన్ హోటల్లో ఆరుబైట చాలా బడలికతో — అసహనంగా కూర్చుంది.

ఓ కప్పు కాఫీ ఆర్డరిచ్చి — అది చాలక, మూడు కప్పుల కాఫీ తెప్పించుకు తాగింది. రిస్ట్ వాచ్ కేసి విసుగ్గా చాలా సార్లు చూసుకుంది. టేబుల్‌మీద ముక్తాయింపులు ఇచ్చింది. మాటిమాటికి రోడ్డువైపు చూస్తూ 'ఛ్ఛ' అనుకోసాగింది. ఆమె వైఖరి ఓ కంట కనిపెట్టిన ఓ వెయిటర్ తన సోదర వెయిటర్‌తో 'ప్రియుని రాకకోసం వేచి ఉన్నట్టుంది' అని కనుసౌజ్ఞతో తెలియజేశాడు.

కానీ, పాపం హెలెన్ ప్రియుని కోసం వేచి, కాసుక్కూచోలేదు. ఆమె—అక్క రావడంలేదు. వస్తానని ఆమె చెప్పిన టైము దాటి రెండు గంటలయింది ఎంత సేపటికీ ఆమె జాడే లేదు. హెలెన్‌కి విసుగు భయంగా మారి, ఆందోళన అయింది.

హెలెన్ జర్మెట్‌నుంచి విస్పకి రైలులో బయల్దేరి, విస్ప చేరింది. ఆమె—అక్క జరీన్ మాత్రం రైలులో ప్రయాణం చేయడానికి అంగీకరించక, ఆ ముప్పై అయిదు కిలోమీటర్లు సైకిలుమీదే వస్తానని మారాముడి వేసింది. ఇద్దరూ విస్పలో సాయంత్రం అయిదయ్యేలోగా కలుసుకోవాలని తీర్మానించుకున్నారు. కానీ, ఏడు దాటినా జరీన్ పత్తాలేదు.

టైము ఎనిమిదయింది. కొండల మీదుగా వచ్చే చల్లగాలి భరించలేక, ఆమె ఆరుబైట నుంచి, వడవలోకి తన కుర్చీ మార్చుకుని, కర్తవ్యం నిర్ణయించుకో నారంభించింది. తెలియని ఊరు— ఒంటరితనాన్ని తల్చుకునే సరికి ఆమె ఒళ్ళు ఝల్లున జలదరించింది స్విట్జర్లండ్‌లోనే ఆమెకు తెలిసిన వాళ్ళెవరూ లేరాయె ! ! కంగారుపడి, తెలివి తక్కువ యాత్రికుల్లాగ— పోలీసు—రిపోర్టు చెయ్యడానికి ఆమె మనస్సు అంగీకరించలేదు.

మరో గంటయ్యేసరికి ఓ నిర్ణయానికి వచ్చేసింది. కాలినడకన తన అక్కకు ఎదురు వెళ్ళడానికి నిశ్చయించుకుని, ఇక్కడ పడుండడంకన్నా, అదే మంచిదని తీర్మానించుకుంది. అలా వెళితే తప్పక ఆమెను కలవవచ్చు అనుకుంది.

ఆనాటి రాత్రి వెన్నెల పిండారపోసినట్టుంది. పున్నమి చంద్రుని కాంతులు తెల్లగా, స్వచ్ఛంగా కొండల మీద పడి, కొండలకు తెల్లటి పూత వేసినట్టుంది. ఆ ప్రదేశమంతా చక్కని 'ప్రశాంతం' రాజ్యం చేసింది దూరంనుంచి అప్పుడప్పుడు ఆవుల మెడల్లో గంటల శబ్దం— అదిగాక, నిశ్శబ్దానికి భయపడి అరిచే 'కక్కూ' ( Cuckoo ) పక్షుల అరుపులు మాత్రం వినిపిస్తున్నాయి. దూరాన్న మిణుకు—మిణుకుమనే దీపాలు, గుడిసెల్లో దీపాలు వెలిగినట్టు చాటుతున్నాయి.

హెలెన్ రోడ్డు ప్రక్కన ప్రతీ గుడిసెవద్దా ఆగి, తన అక్కను వర్ణించి— అలాంటి ఆమెను చూశారా? అని అడిగింది. కనబడిన, ఎదురైన ప్రతీ వారినీ అడిగింది. కాని 'జరీన్'ను మేం చూడలేదంటే, మేం చూడలేదన్నారు.

దారి మార్చి, "సైంట్ నికొలాస్ వాలీ" వైపు వెళ్ళింది. ఆ దారి, లోయ, చంద్రకాంతి పడనంత దట్టంగాను, పల్లంగాను ఉంది. రోడ్డు వెడల్పు రాను—రానూ తగ్గి, అక్కడికి వచ్చేసరికి మూసుకుపోయింది.

హెలెన్ కాస్సేపు అటూ ఇటూ చూసి, ఎలుగెత్తి "జరీన్" ! అని కేకవేసింది. భయాందోళన, ఆవేదనలతో వేసిన ఆమె—కేకకు బదులుగా పరిహాసం చేస్తున్నట్టు ప్రతిధ్వని తిరిగి 'జరీన్' అని అరిచిందే గాని, వేరే కంఠం సమాధానం చెప్పలేదు. హెలెన్ ఆ రాళ్ళలో నడుస్తూ కాలు—జారి పడి, గమ్మున విభాయించుకుని, లేచేసరికి మోకాళ్ళూ, మోచేతులూ కొంచెం కొట్టుకుపోయాయి.

అంత అందమైన రాత్రి, చూస్తుండగా ఆమె పాలిట కాళరాత్రిగా మారిపోయింది.

కనుపించిన ప్రతీవారినీ తన అక్కను గురించి అడుగుతూనే ఉంది. సైంట్ నికొలాస్, కాల్‌ప్రెటన్ అనే ఊళ్ళల్లో ఇంటింటా, షాపు షాపుకీ తిరిగి, అడిగి, అక్కడ చాలా టైము వ్యర్థం చేసుకుంది

చూస్తుండగా రాత్రి ఒంటి— గంటయింది. ఒక హోటలు యజమాని జరీన్ వర్ణనలో సరిపోయే వర్ణన గల ఒక ఆమెను వర్ణించి, ఆమె తన హోటలుకు వచ్చిందని చెప్పాడు. హెలెన్ ముఖం వికసించి, వెంటనే రెట్టింపు విచారం, ఆందోళనలతో ముకుళించుకుపోయింది.

నిన్న మధ్యాహ్నం ఆ హోటలు యజమానికి కనబడిన మనిషి, అర్థరాత్రి ఒంటిగంట అయినా విస్పకి రాకపోవడం ఏమిటి ? నికరంగా, నియమం ప్రకారం నాలుగు లోగానే విస్ప చేరాలికదా ? కానీ, ఆమె జాడ లేదు. ఆనక ఆమెను మరెవరూ చూడను కూడా లేదు.

హెలెన్‌కి ఒళ్ళు ఝలదరించింది. ఆమె ఎంతో వేదన కనిపెట్టిన ఒక నెరిసిన మీసాలాసామి ఆ రాత్రి తన హోటల్లో విశ్రాంతి తీసుకుని, ప్రొద్దుటే పోలీసులకు రిపోర్టిస్తే మంచిదని నచ్చచెప్పాడు.

హెలెన్ తల అడ్డంగా వూపింది.

"ఎబ్బే— వీల్లేదు — తెల్లారేలోగా విస్పకి వెళ్ళే దారిలో ప్రతీ ఇంటినీ గాలించి చూడాలి. ఏదైనా ప్రమాదానికి గురై ఏ రోడ్డు—పక్కనైనా పడుందేమో చూడాలి. లేక అలసటవల్ల ఎక్కడైనా

—37 వ పేజీ చూడండి




"మీరూ ఓ కథ రాయండీ" అని ఈ సరికి చాలాసార్లు చెప్పింది శ్రీమతి. బద్ధకంగా ఉందని, చికాగ్గా ఉందని, నిద్రవస్తోందని— సమయానుకూలంగా ఏదో చెప్పి వాయిదా వేస్తున్నాను...... నేడు మళ్లీ ఈ ప్రస్తావన వచ్చింది.

* * *

ఆమధ్య, మా పక్కవాటాలో ఉన్నాయన రాసిన కథ త్వరలో అచ్చవుతుందని ఒక ఉత్తరం చేరింది వారికి. ఆ ఇల్లాలు మరుక్షణం మా తలుపు తట్టి అమితానందంతో ఆ వార్త చెబుతూ, సాంతం ఆ ఉత్తరం చదివి వినిపించింది. వెన్వెంటనే శ్రీమతి చేతికిచ్చి వెళ్లిపోయింది.

ఆ ఉత్తరం ఇటూ అటూ త్రిప్పి, నావైపు ఆసక్తిగా చూస్తూ: "మీరూ ఓ కథ రాయకూడదుటండీ ?" అని ప్రశ్నించింది.

"కూడదని లేదు కానీ, పడుతుందనే నమ్మకం లేదు" అన్నాను నసుగుతూ.

"కథలురాసి పంపుతూ ఉంటే, దయతలచి ఏదో నాటికి కథ వెయ్యకపోరు." సునాయాసంగా అందామె.

నేను నవ్వి ఊరుకున్నాను.

* * *

ఒక ఆదివారం ఉదయం పరుగున వచ్చిందా ఇల్లాలు. చేతిలో పత్రిక తెరచి ఉంది. విశేషం నాకు గ్రహింపుకు వచ్చింది. ఆమెలోని ఉత్సాహం ఆమె చెప్పదల్చుకున్న వార్తను చెప్పనీయటం లేదు. నవ్వుతూ నిలబడిపోయింది. ఆమె చేతిలోని పుస్తకాన్ని. ఈమె అందుకుని కథ పేరు, పక్క పేజీలోని చిత్రం సమన్వయించి చూసింది.

"ముందొక కథ చదివి పుస్తక మిచ్చేయండి. మిగతావి తర్వాత చదూదురుగాని" అని ఈమెకు చెప్పి, నాకు వేరే చెప్పనవసరం లేదన్నట్టు అదోలా చూసి, వెళ్లిపోయిందామె.

ఈ సంఘటనతో వాతావరణం మారిపోయింది.

"మీరూ ఓ కథ పంపండంటే విన్నారా ?" కొన్ని నిమిషాల దుర్భరమైన నిశ్శబ్దం తర్వాత ఆమె తీక్షణంగా అంది. కోపం అభినయించింది.

నేను మాటాడలేదు. వినోదంగా నవ్వాను. ఆమెకు మరింత చికాకయింది.

"ఈ రాత్రి ఓ కథ రాసి, రేపు పోస్టులో పంపకపోతే నేను మీతో మాటాడేదిలేదు" అని ఆమె అక్కణ్ణించి వెళ్లిపోయింది.

* * *

వారం తిరక్కుండా మరో సంఘటన:

ఆనాడు ఇంటికి రాగానే ఆమె ఎదురొచ్చి ఎమ్. ఒ. కూపను, మూడు పది నోట్లు టేబుల మీద ఉంచి, మౌనంగా నిలబడింది.

నాకు ఆశ్చర్యంతోబాటు ఆత్రుత హెచ్చయింది.

బ్రతకలేక బడిపంతులు అనేది నా అనుభవానికి రాలేదు కాని, బడిపంతులు బ్రతకలేడని ఋజువైంది. ఆత్మగౌరవం విద్యార్థులవల్ల, వ్యక్తిత్వం అధికారులవల్ల నశించిపోయింది.

నాలుగు మాసాలై జీతాలు రాలేదు. నోరమంచైతే ఊరు మంచిదని బడిపంతులు ఏనాడో గ్రహించి ఉండాలి.

అవసరమైతే చేతులు జోడించటానికి నేనేమాత్రం వెనుకాడను. పౌరుషానికి పోతే పస్తు పడుకోవాలి.

ఈ తరుణంలో స్థానిక వర్తకుల సహాయ, సహకారాలకు కృతజ్ఞులం.

టేబిలుమీదున్న నోట్లవైపు వెర్రిగా చూసి, ఎవరు పంపించారో తెలియకపోయినా, వారిని మనసులోనే అభినందించి, కూపను రెండోవైపున ఉన్న ఎడ్రస్ చదివాను.

మతిపోయింది.

కథ పంపినందుకు కృతజ్ఞత తెల్పుతూ పంపిన పారితోషకమది. ముట్టుకోటానికైనా నాక అర్హతలేదు.

సంగతి విశదమైంది. ఆమె ఈ రూపాయల ఈమె చేతికెందుకిచ్చిందో నాకు అర్థంకాలేదు.

తర్వాత తెలిసింది.

కళ్లజోడు, ఒక పెన్ను కొనుక్కోవాలని అతనికుంది. కాళ్లజోడు, జరీచీర కావాలని ఆమె అంది. ఇరువురూ రాజీకి రాలేక ఆ రొక్కం ఈమెకందించారు.

"నీ అభిప్రాయం ఏమిటి ?"— నిర్లిప్తంగా అడిగాను.

"ఒక మంచి పెన్నూ, ఒక చీర కొనండి."

నిజానికి నాకీ పెద్దరికం అనవసరం. భేదాభిప్రాయాలున్న ఇద్దర్ని సమానంగా మెప్పించటం తేలిక్కాదు.

మెప్పించి, మెప్పు పొందటం అతని కర్తవ్యం. నా అభిప్రాయం తెలియజేశాను.

ఆమెలో అసహనం పెరిగిపోయింది.

ఆ నోట్లను గుప్పిట్లోకి తీసుకుంది: "ఏది చెప్తే మీరు విన్నారు కనుక! చెప్పగానే ఓ కథ పంపితే, పదో, పరకో— రేపో మాపో వచ్చునా ? ఈ ఇబ్బందిలో ఏ అవసరమైనా తీరును" అని ఆమె క్రోధంతో వెళ్లిపోయింది.

రాత్రి భోజనానంతరం నిద్రపోయేలోగా ఆ దినం విశేషాలు చర్చించటం పరిపాటి. ఏవో కబుర్లు చెప్తూ సందర్భం కల్పించుకుని 'కథ ఎప్పుడు రాస్తారని' ఆమె ప్రశ్నించటం కూడా పరిపాటయింది.

నే నింతవరకూ ఆ ప్రశ్నకు జవాబు ఆలోచించలేదు. సర్వ సాధారణ విషయంగానే పరిగణించాను నేడా ప్రశ్న తీవ్రరూపం దాల్చింది.

ఒక కథకు ముప్పయి రూపాయలంటే ఆమె

దృష్టిలో చాలా హెచ్చు, కథలు రాయటం చాలా తేలిక : ఆమెకుగల ఈ తేలికైన అభిప్రాయం వన్ను చిక్కులో వేసింది

ఒంటిపూట బళ్ళు వేసవిలో బాగావే ఉంటాయి. కాని, ఇంటిలో పోరువుంటే రాత్రి బళ్ళుకూడా అవసరమనిపిస్తుంది.

మధ్యాహ్నం నిద్రలేచి, కాఫీ తాగుతూ మెల్లిగా అన్నాను : "నాకు కధలు రాయటం రాదు. నీవు రాస్తే, నేను చక్కగా కాపీచేసి నీ పేరున పంపుతాను" అని.

"నాకు చాతనయితే మిమ్ము బ్రతిమాలటం దేనికి ?"

"మరి నేను రాయగలనని ఎలా అనుకుంటున్నావ్ ?"

"మీపాటి చదువు నాకు లేదుగా !"

"చదువుకున్నవాళ్లంతా కధలు రాయగలరంటావా ?"

"అదంతా నాకు తెలీదు.... నిజంగా మీరు రాయలేరా ?"

రాయలేనని తల ఆడించాను.

ఆమె తీక్షణంగా చూసినంతలో ఆమె ముఖమంతా కోప మలుముకుంది. నిరసనగా వెళ్లిపోయింది.

టేబిలు మీదున్న పేపరందుకుని మొదటి పేజీ చూస్తున్నాను. సమీపంలో ఏదో నేలపడిన చప్పుడయింది. తలెత్తి చూచేసరికి ఆమె నవ్వుతూ నిలబడింది.

నేల చూసి గతుక్కు మన్నాను. ప్లాస్టిక్ సంచీలో బంధించబడిన పుస్తకాలవి. అవేమిటో నాకు బాగా గుర్తు.

కాలెజీ మేగజైను ఉంది. అందులో నా కథ ఉంది కాలేజీ వాతావరణానికి సంబంధించిన కథ.

పాఠశాల విడిచి కళాశాలకు వెళ్లడమంటే, బాల్యంనుంచి యౌవనంలోకి ప్రవేశమన్నమాట. ఎవరు కాదన్నా, నాయకీ నాయకులు ఒప్పుకోరు.

మరో పది, పన్నెండు పెద్ద కవర్లు. కథల చిత్తు ప్రతులవి. కాపీచేసే శ్రద్ధలేక అలా ఉండిపోయాయి.

"మిస్. స్వర్ణలత' అనే కథ మాత్రం చక్కటి ప్రతి ఉంది. దాన్ని పంపటంలో అశ్రద్ధ జరిగింది.

ఇవన్నీ ఒక దశాబ్దం వెనుకవి.

1960 లో మూణ్నెల్లు శ్రీమతి పుట్టింట్లో ఉంది. ఆ సమయంలో ఒక నవల రాసేను. పునః పరిశీలన లేక అలా ఉండిపోయింది. అదొక దస్తా.

ఈ సరికి నాకుగల అశ్రద్ధ మీా అంచనాకు దొరుకుతుంది.

సరే, శ్రీమతిని వింతగా చూసి నోటమాట రాక అలా ఉండిపోయాను.

ఇపుడేమంటారన్నట్టు ఆమె ప్రశ్నార్థకంగా చూసింది.

నేను ఓడిపోయాను, నా ఓటమి అంగీకరించాను

ఆమె స్వేచ్ఛ గా గాలి పీల్చింది. నేనిక రచనకు ఉపక్రమిస్తానని ఆమెకు నమ్మకం కలిగి ఉంటుంది

ఆమెకు తెలీదనే నే నింతకాలం అనుకున్నాను, తెలియకూడదనే నా ప్రయత్నం.

సామాను గదిలో కొయ్యపెట్లో వాటిని భద్రపరిచాను ఆ పెట్టె ఎందుకు తెరవాల్సి వచ్చిందో నేను ప్రశ్నించలేదు. కారణం తెల్పుకుని నేను చేసేదేమీా లేదు.

ఆ రాత్రి భోజనానంతరం కుర్చీలో కూచుని పుస్తకం చూస్తున్నాను. ఒక అరగంటలో తెల్ల కాగితాలు, పెన్నుతెచ్చి లాంఛనగా అందామె :

"ఇవాళ మంచిది. కథ పూర్తయేవరకూ ఆవలించకూడదు. శ్రీకారం చుట్టండి." అని.

ఇది చిత్రమైన అవస్థ. మెదడు పనిచేయటం లేదు.

నాకు కోపమయిన మాట వాస్తవమే కాని, అసహనంతో కసిరివెయ్యటానికి ఆమె చిన్నపిల్ల కాదు.

గృహిణి, నా ఇంటికి యజమానురాలు !

నేనేమీా చెయ్యలేని పరిస్థితిలో అమాయకంగా చూసేను !

ఆమె చమత్కారంగా నవ్వింది ! !

కలం తీసుకున్నాను. కాగితాల్లోకి చూస్తూ కొన్ని క్షణాలు ఆలోచించాను.

సమస్యలు అందరికీ ఉంటాయి. కొందరికి తీవ్రంగా ఉంటాయి. మానసిక బలహీనతను బట్టి అవి వేధిస్తాయి.

నాకు లేవని అనలేను కాని, ఈ రకమైన సమస్యనే నెప్పుడూ ఎదుర్కోనలేదు. రచన వృత్తిగా పెట్టుకున్నవారు కూడా ఎదుర్కొని ఉండరు. అలా జరిగిఉంటే ఆ రచయితకు నా సానుభూతి

ఈ బాధ అతనొక్కరే అర్థం చేసుకోగలరు

నిట్టూర్పు విడిచి, తల ఎత్తకుండానే, మెల్లిగా అన్నాను :

"భావాలు దొరకటంలేదు. తగిన అవకాశం ముంటేనే కాని కలం నడవదు." అని.

"ఏమి చిత్రం !.... మీారు పారాలెల్లా చెప్తున్నారండీ ? పిల్లలు ఏదైనా ప్రశ్నవేస్తే 'ఇపుడు కాదు, మరొకమారు' అంటారేమిటి ?"

నిజమే, అలా అనకూడదు.

కాని ఇది వేరు, ఆమెకు అర్థంకాదు

పెన్ను తెరచి అరచేతిలో చుక్కలు పెడుతున్నాను. ఆలోచన పోవటంలేదు.

"ఏం పేరు పెట్టమన్నావ్ ?"

"ముందు కథ రాయండి. పేరుకు తొందర్లేదు.... 'పేరులేని కథ' అన్నా తప్పులేదు."

అవును, తప్పులేదు.

కాగితాలు కుదురుగా పెట్టుకున్నాను. నేనేమి రాస్తానోనని ఆమె ఆసక్తిగా నా కలంవైపు చూస్తోంది.

నేటికీ నాకా బలహీనత పోలేదు. పరీక్షలు రాసేటపుడు వాచరు ప్రక్కని నిలబడి ఉంటే, గోళ్లు కొరుకుతూ కూచునేవాడ్ని అతడది గమనించి, ముందుకు పోయేవాడు.

ఆ మాటే చెప్పాను. ఆమె నవ్వింది.

నేను రాయటం ప్రారంభించాను :

కాలేజీ నుండి వచ్చి డ్రసింగ్ రూంలో. దుస్తులు మార్చుకుంటున్నాను.... డ్రాయింగు రూములో ఫోను పిలిచింది.

రిసీవరు తీసుకున్నాను.

"రాజేశ్వరిని మాస్టారూ ! పరీక్ష పాసయాను. మీాకు ముందు తెలియజెయ్యటం నా కర్తవ్యమని...."

"కంగ్రాచ్యులేషన్స్. వెంటనే రా. ఫ్లాస్కులో కాఫీ ఉంది. నీ కోసం వెయిట్ చేస్తుంటాను...."

"ఎవరీ రాజేశ్వరి ?"

నా కలం ఆగిపోయింది !

ఆమె అడిగిన వెంటనే తలెత్తి చూసేను. ఇందాకటి ఉత్సాహం ఆమెలో లేదు.

"నువ్వే" అన్నాను. ఆమె నవ్వుతుందని ఆశించాను.

కాని సీరియస్‌గా అంది :

"నే నేం పరీక్ష పాసయాను ?.... ఈ ఊళ్లో కాలేజీ ఎక్కడ ఉంది ?" అని.

"అనుకోడాని కేంపోయింది ?"

"ఎందుకీ బడాయిలు !.... మనింట్లో ఫోను ఉందంటే ఎవరైనా నమ్ముతారా ?.... చాలీచాలని జీతంతో బాధ పడుతుంటే ఫ్లాస్కులూ, కాఫీలు ఎలా వస్తాయి ?.... ఇన్ని అబద్ధాలెందుకు ? ఇవన్నీ నమ్మటానికి అమాయకుల్లేరు. ఈ కథ అచ్చువేసుకోరు. మరొకటి రాయండి.."

నేను నవ్వబోయి ఆమెను చూసి ఆగిపోయాను. ఆమెలో మార్పేమీా లేదు.

ఇదంతా పరిహాస మనుకోటానికి వీల్లేదు.

ఆమె కేమని చెప్పాలో తెలీలేదు.

ఆమె ఆ కాగితం చింపివేసింది.

'థాంక్స్' అనుకున్నాను.

"మిమ్మల్ని మీారు మోసగించుకుంటూ, ఈ కథ చదివే వాళ్లని మోసం చేస్తున్నారు.... ఇందులో ఒక్కటి నిజం లేదు." ఆమె కాగితపు ముక్కలు కిటికీలోంచి వీధిలోకి విసురుతూ అంది.

"మరి కధ లెలా రాస్తారుటా !" నేను దీర్ఘం తీస్తూ, ఎగతాళిగా అడిగాను.

నాకు నవ్వాగలేదు.

క్షణం తీక్షణంగా చూసి : "బాబూ ! మీా కథకో దండం" అని రుసరుస వెళ్లిపోయిందామె.

* * *

ఒక నెల తిరిగి తిరక్కుండానే—

పక్కింటాయన రాసిన మరో కథ పడింది.

నా గుండెల్లో మరో రాయి పడింది.

36 వ పేజీ చూడండి



అందుకే 'శారదాఆక్టు' వచ్చింది: చిన్నప్పుడే పెళ్లిళ్లుచేస్తే ఈలాగే ఉంటుంది... వరస...!

## గ్రహ స్థితి

వృషభ మిధునాలలో బుధ శుక్రులు; మిధునంలో సూర్య రాహువులు; సింహంలో అంగారకుడు; ధనస్సులో కేతువు; మకరంలో శని; మీనంలో గురువు; కన్య, తులా, వృశ్చికాలలో చంద్రుడు.

### మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

బాహ్యాడంబరం అధికం. ముఖ్యమైన పనులలో స్నేహితుల సహాయం అవసరం అవుతుంది. పడమర, ఉత్తర దిశలనుంచి వచ్చే వార్తలు మనో ధైర్యాన్ని తగ్గిస్తవి. ధన విషయంలో కొరత కనుపించదు. అయితే వృధాగా ఖర్చు అవుతున్నదనే బాధ తోస్తుంది. అధికారులవద్ద మీ పనులు సుఖంగా జరుగుతవి. కాని, అలస్యానికి అవకాశం ఉన్నది. ఎదటివారు మిమ్ములను ప్రోత్సహించినా వ్యవహారాలను సౌమ్యంగా పరిష్కరించుకొనగలుగుతారు ప్రయాణాలు లాభదాయకంగా సాగుతవి సూటి పోటి మాటలతో మనశ్శాంతి లోపిస్తుంది. 1, 2 తేదులలో శుభవార్తలు, ఇష్టవస్తు లాభం.

*　　*　　*

### వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)**

కుటుంబ విషయాలలో ఏదో ఒక అసంతృప్తి తోస్తూ ఉంటుంది ఈ సమయంలో ధనవ్యయం అవుతుందే కాని, ప్రయోగం తక్కువ. వ్యవహార రంగంలో మీ కార్యం బాగానే ఉంటుంది కార్యరూపంలో మాత్రం మార్పులు జరుగుతూ ఉంటవి బంధు మిత్రుల నిమిత్తం శ్రమ కలుగుతుంది. అకస్మాత్తుగా ప్రసంగాలు పాకం ముదిరే స్థితికి వస్తవి. స్వల్ప వ్యాపారాలలో పెద్ద మార్పులు ఉండవు ఇతరులవద్ద నుంచి రావలసిన ధనం వస్తుంది స్నేహితుల మాటలను నమ్మటంవల్ల తగినంత ఉపయోగం పొందలేకపోతారు. స్వయం కృషితోనే క్రమంగా ముందుకు పోగలుగుతారు గౌరవప్రదమైన పదవిలో పాల్గొంటారు. 2, 3 తేదులలో కార్యసిద్ధి, స్వల్ప అసౌఖ్యం.

*　　*　　*

### మిధునం :

**(మృగశిర 3, 4 పా., ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

తరచూ ఏదో ఒక సమస్యను ఎదుర్కొంటూ ఉండవలసిన సమయం ముందుముందు ఫలితం పొందగలమనే ఆశ మాత్రం కనుపిస్తుంది. మీ రహస్యాలు బయటపడే అవకాశాలున్నవి. ఆటంకాలను తొలగించుకొంటూ, మీ బాధ్యతలను నెరవేర్చవలసివస్తుంది. మీ అభిప్రాయాలను బలపరచవలసిన వారే నిరుత్సాహపరుస్తారు. దేహశ్రమ




**దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి**

**28-6-1963 శుక్రవారము మొదలు 4-7-1963 గురువారము వరకు**

అధికం. సంఘంలో పేరు సంపాదించుకొంటారు. ఏదో ఒక విధంగా మీ అవసరాలకు కావలసిన ధనం లభిస్తుంది. ప్రస్తుతం ఎవ్వరినీ అతిగా నమ్మ వద్దు. మీ సుఖాన్ని గురించి, కుటుంబంలోని వారి సుఖాన్ని గురించి శ్రద్ధ తీసుకొనవలసిన సమయం. 3, 4 తేదీలలో ధననష్టం, అపవాదులు.

*　　*　　*

### కర్కాటకం :

**(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష.)**

మధ్యలో ఎన్ని ఆటంకాలు వచ్చినా, మీ వృత్తి వ్యాపారాలకు సంబంధించిన కార్యకలాపాలు సాఫీగా సాగుతవి. ఎదటివారి పొరపాట్లను మీరే సర్దుకుని పోగలుగుతారు ఉదార స్వభావం గల పెద్ద మనుష్యుల స్నేహం లభిస్తుంది ఆదాయం పెరుగుతుంది. కుటుంబంలో సుఖసంతోషాలు లభిస్తవి. కుటుంబంలో ఖర్చు, తీరని సందేహాలు ఎదురు అవుతూ ఉంటవి. సంఘంలో ఎవ్వరి మాటనూ కాదని అనకుండా మీ స్థితిని బలపరుచుకొంటారు ఇతరులతో కలిసి చేయు పనులలో అన్ని విధాలా అనుకూలత కనుపిస్తుంది వారాంతంలో శుభ వార్తలు తెలుస్తవి. 28, 29 తేదీలలో పుణ్య కార్యాలు, ధన లాభం.

*　　*　　*

### సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

శ్రమతో ఫలితం పొందతగిన సమయం. చాల చిన్న విషయాలలోనే ముందు కంగారు పడతారు చివరకు అన్నీ నెమ్మదిగా జరిగిపోతవి. వృత్తిలో తలవని తలంపుగా సహాయం లభిస్తుంది కోర్టు కచేరీలతో ఇంతకుముందు కలిగిన భయం తీరిపోతుంది. సుఖము, సంతోషము లభిస్తవి. మీ పొరపాట్లవలన కలిగిన చిక్కులు ఒక విధంగా అనుకూల మార్గానికి వస్తవి. శిరోభాగాలలో బాధలు కలుగుతవి. ప్రస్తుతం మీ వినావమే మిమ్ములను కాపాడుతుంది. క్రొత్త బాధ్యతలను పైన వేసుకోవద్దు. వారం రెండవభాగంలో తలవని తలంపుగా వివాదాన్ని కలిగించే వార్తలు తెలుస్తవి. ధన

## ఈ వారము ధరలు

ధాన్యం ధర పెరుగుదలలో ఉంటుంది. నూనెల రకాల ధరలలో క్రమంగా తగ్గు మొఖవలున్నవి. మావుల ధర హెచ్చుతగ్గులతో కూడిన సమయం. మిర్చి ధర మందీలో నిలుస్తుంది. ధనియాల ధర పెరిగే అవకాశాలున్నవి.

విషయంలో జాగ్రత్త అవసరం. 29, 30 తేదీలలో ఖర్చులు, త్రిప్పట.

*　　*　　*

### కన్య :

**(ఉత్తర 2,3,4 పా., హస్త, చిత్త 1, 2 పా.)**

ఎంత ఓర్పు వహించినా, ఒక స్థితిలో తొందర పడటం జరుగుతుంది. ముందు ఆశపెట్టి నిరుత్సాహపరిచేవారుంటారు. ఏది ఏలా ఉన్నా, మీ వాగ్దానాలను నిలబెట్టుకొనడానికి చూడండి అనవసర విషయాలలో ఆసక్తి పెట్టుకొని పశ్చాత్తాప పడతారు. యంత్రాలు నడపటం, అగ్ని, ఆయుధాలు వీటికి సంబంధించిన పనులలో చాల జాగ్రత్తగా ఉండటం అవసరం మీ ధనాన్ని అనుకోకుండా క్రొత్త మార్గాలలో వినియోగించటం జరుగుతుంది ఈ సమయంలో ఆప్తుల సలహాలు అనుసరించటం అవసరం పిల్లల ఆరోగ్యం బాగుండదు వృత్తి వ్యాపారాలలో సంబంధం కల వారితో మానసిక స్పర్థలు రాగల అవకాశాలున్నవి 30, 31 తేదీలలో సంతోషవార్తలు, ధర్మకార్య నిర్వహణం

*　　*　　*

### తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

సంతోషంగా మాట్లాడిన ప్రతి ఒక్కరూ ప్రత్యక్షంగా సహాయం చేస్తారని అనుకోవద్దు. మీ కష్టము అక్కరకు వస్తుంది. అన్ని విధాలా పేరు, ధనాదాయము పెరుగుతవి పది మందీ మీ సలహాను పాటిస్తారు. ఆదరాభిమానాలతో ఉంటారు. వృత్తి ఉద్యోగాలలో గాని, సంఘకార్యాలలో గాని ఎదురుపడే సాధారణ సమస్యలు వాటంతటా అవిగా సమసిపోతవి అయితే ఏ సందర్భంలోనూ అవతలివారు అసంతృప్తి చెందవలసిన అవసరం రాకుండా, మీరు చెప్పిన మాటను నెరవేర్చుకొంటూ ఉండటం అవసరం. తలవని తలంపుగా అనారోగ్యం చేసి నెమ్మదిస్తుంది వృధా ప్రసంగాలతో, పనులు ఆగిపోకుండా చూచుకొనండి. ప్రయాణాలు సాగుతవి. 28, 29 తేదీలలో వినోదపు ఖర్చులు; కార్యాలస్యం.

*　　*　　*

## వృశ్చికం :

**(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

పదిమందిలో మీ ప్రత్యేకతను నిలుపుకో గలుగుతారు. మిమ్ములను వెక్కిరిద్దా మనుకొన్న వారు చివరకు వారే వెల్లికిల బడతారు. లాభము, క్షేమము దక్కుతవి. ఒక్కొక్క సమయంలో కోపం వస్తుంది. కాని, జాగ్రత్తగా నిగ్రహించుకో గలుగుతారు. మీరు చేసే పనులు, చెప్పే మాటలు పదిమందినీ ఆకర్షిస్తవి. రకరకాల కార్యక్రమాలలో పాల్గొంటారు. దైవికంగా మీ కార్యక్రమాలు ఆయా సమయాలకు తగినట్లుగా కలిసివస్తవి. వారాంతంలో ఆరోగ్య భంగం చేయవచ్చు. బంధువుల వల్ల కొంత భారం పైన పడుతుంది. కోర్టు కచేరీలలో అనుకూలత కలుగుతుంది. 29, 30 తేదీలలో నౌకరులతో కలహ ప్రసంగాలు; విలువ గల వస్తువులు కొనటం.

* * *

## ధనుస్సు :

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)**

మీరు ఎవరితో కలసినా, భావాలు అనుకూలించవు. అడిగేవారికి చెప్పేవారు లోకువ అన్నట్లుగా ఉంటుంది మీ పని; గొప్పకోసం ప్రాకులాడటమే గాని, సుఖము, లాభము అంతగా ఉండవు. సౌమ్యముగా మీ పని మీరు చూచుకొవటం అవసరం. వృత్తిలో అనుకూలంగా ఉన్నవారు కూడా వెనుకకు తప్పుకొంటారు. ఆరోగ్యం బాగుంటుంది. ప్రస్తుతం లభించినంతవరకు అందుకుంటూ, రావలసిన దానికి ప్రయత్నించ గలుగుతారు. ఇంతకుముందు మిమ్ములను నమ్మకుండా ఉన్న వారు మిమ్ములను విశ్వసించి ఆదరాభిమానాలను చూపిస్తారు. కుటుంబంలో వివాద సూచనలున్నవి. 3, 4 తేదీలలో త్రిప్పట, దండగ ఖర్చులు.

* * *

## మకరం :

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

ప్రస్తుతం మీ ప్రయత్నాలు కలిసివచ్చి లాభం పొందటమే కాకుండా ముందుకు మార్గాన్ని కూడా తెలుసుకో గలుగుతారు. మనోధైర్యం బాగుంటుంది. మొదట ఆశించినంత మేలు కలుగక పోవచ్చు. కాని, నిరుత్సాహ— పడవలసిన అవసరం ఉండదు. ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడు కొవండి. వ్యవహార రంగంలో ఎంత గట్టిగా ఉంటే అంత మంచిది. కుటుంబంలోని వారు మీ మాటను పాటించక పోవటంవల్ల కొంత బాధ కలుగుతుంది. ఆర్థిక సహాయం లభిస్తుంది. వృత్తిలో మాట తప్పవస్తుందేమోనవే బాధ కలుగుతుంది. ప్రయాణాలు అనుకూలిస్తవి. మాటలలో నహనంగా ఉండటం అవసరం. విలువ గల వస్తువులు కొంటారు. 2, 3 తేదీలలో ఆదాయవృద్ధి, శుభవార్తలు.

* * *

## కుంభం :

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

పైకి దర్పంగా ఉండటానికి ప్రయత్నం చేయబోతారు. కాని, సాధ్యంకాదు. శక్తికి మించిన పనులవల్ల ఆందోళనకు గురి అవుతారు. పిల్లల ఆరోగ్యం బాగుండదు. మీ వ్రాతలలోను, చేతలలోను ఎక్కడో తెలియకుండా పొరపాట్లు వస్తూ ఉంటవి. స్నేహితులతో మంచితనాన్ని కాపాడుకొంటారు. ఏదో ఒక సమయంలో కలహాలు వస్తవని ఎదురు చూడవలసిన సమయం. వృత్తిలో అసూయా—పరులవల్ల బాధపడతారు. ప్రయాణాలు, శుభకార్యాలు ఆగిపోయే అవకాశాలున్నవి. ముందుగా మీ శక్తి, పనియొక్క అంచనా తెలుసుకొని ప్రవేశించవలసిన సమయం. 1, 2 తేదీలలో ధనప్రాప్తి, మిత్రలాభం.

* * *

## మీనం :

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)**

మీ ఓర్పువల్ల కష్టం తెలియకుండ పోతుంది. వృత్తి ఉద్యోగాలలో మిమ్ములను శ్రమ పెట్టే వారితోపాటు, ఆదరించేవారు కూడా ఉంటారు. కుటుంబంలోని లోపాలు గాని, బాహ్యంగా కనుపించే శ్రమలు గాని ప్రత్యక్షానికి రాకుండ చికాకు పరుస్తూ ఉంటవి. పైకి బాగున్నట్లే నటించవలసివస్తుంది. ఒక విశేషం ఏమంటే ఆర్థిక బాధలు మాత్రం మీ మీదికి రావు. బంధువుల కష్ట సుఖాలలో మీరున్నా శ్రమ పడతారు. వారాంతంలో శుభవార్తలు తెలుస్తవి. దక్షిణ దిక్కు మంచి కార్యానుకూలత, మిత్ర సహాయం ఉంటవి. మొదట నిష్కర్షగా మాట్లాడలేక పోయిన సందర్భాలలో అధిక వ్యయ ప్రయాసలు వచ్చి పడుతవి. 30, 1 తేదీలలో మనోబాధ, బంధు దర్శనం, వృధా కాలక్షేపం. ★



"అవునండీ! ఆంధ్రరాష్ట్రానికి రాజధాని హైదరాబాదు కదా? ఆ హైదరాబాదు మహానగరంలో రెడ్‌హిల్స్ ప్రాంతంలోనున్న ఇంటి నెంబరు 12A—5—428C గల హుస్సేన్‌గారి ఇంట్లోనున్న ఫోను నెంబరు 8 నుండి నేను అనగా రాంసామిని మాట్లాడుతున్నానండీ...."



"ఓహో! మేఘమాలా పాట" కాదు సాయంకాలం షైరుగా పిచ్‌లో శ్రీ కాంతారావ్ షైరంటే అతనికి ఇష్టం

శ్రీ కాంతారావ్‌కు సాంఘికాలలో 'టిపికల్' రోల్సు రావల్సి ఉన్నది—అట్టివి పౌరాణిక జానపదాలలో ఈ యనకు దొరికాయి ఫేమ్ అనిపించుకున్నాడు

శ్రీ కాంతారావు సమర్థత ఇంతవరకూ ఎక్కువభాగం పౌరాణికాలు, జానపదాలు వాడుకున్నాయి. సాంఘికాలకు ఇప్పుడే మంచి అవకాశాలు వస్తున్నాయి ఈ నటునికి—'కుచేల' చిత్రం అరవం, మళయాళం భాషలలో తీశారు. అందులో ఈ నటునికి కృష్ణునిగా మంచి పేరు వచ్చింది ప్రస్తుతం 'విష్ణుమాయ'లో ఆ వేషం వేస్తున్నాడాయనే శ్రీ కాంతారావు ఎక్కువభాగం 'అంబరీషుడు' 'నారదుడు' లాంటి వేషాలలో దిట్టగా రాణించాడు—సాంఘికాలలో ఇటీవలి 'ఎదురీత', 'కానిస్టేబిల్ కూతురు' మొదలైనవి ప్రశంసనీయంగా ఉన్నాయని ప్రజలూ, విమర్శకులూ ఒప్పుకున్నమాట.

## ఫాన్ మెయిల్ అంటే...

శ్రీ కాంతారావు సెన్సిటివ్‌గా అగుపిస్తాడు మనిషి చాలా కలుపుగోరుతనం— మంచి ఇచ్చి మంచి కోరే—తనం— కృషిని ధారపోసి ప్రేక్షకుల మన్నన పొందేతనం— ఉన్నవానిగా అగుపిస్తాడు "నా ఫాన్—మెయిల్ అంటే నాకు చాలా గౌరవం" అన్నాడాయన

చిన్నప్పుడే వాళ్ళ నాన్నగారు ఈ కుర్రాణ్ణి పెంచాల్సిన బాధ్యతని తల్లికే అప్పగించి కన్ను మూశారు తల్లి పెంపకంలో పెరిగిన వాళ్ళకి సుకుమారం, గారాబం కొండొకచో మూర్ఖమైన పంతం అలవడతాయి

కాంతారావును చూస్తే వాళ్ళమ్మగారికి ఎంత గర్వంగా ఉంటుందో ఆమె బయటకు తెలియనివ్వలేదు గాని, నేను గ్రహించాను ఆమె చిన్నప్పట్నించి ఇచ్చిన 'స్వేచ్ఛ'కు కాంతారావులో ఇవాళకు కూడా కృతజ్ఞతా, భక్తి తొణికిసలాడుతున్నట్లు వాళ్ళమ్మగారూ, తనూ కలిసి ఉండగా చూడగానే గ్రహింపవచ్చును

ఈతనికి వర్తమానం మంచి శుభకాలం భవిష్యత్తు ఇతని కృషికి తగినంతగా ఉండి తీరుతుంది. అనుభవం గల ఈ నటుడు ఇవాళ ప్రయత్నంతోనూ, అధ్యయనబలంతోనూ అగ్రస్థాయిలో మరి పది కాలాలపాటు రాణించగలగడం

# తెరమీద తెరవెనుక

వీరాజీ

**నిస్సందేహం! కాంతారావు శతచిత్ర యాత్రలో రేసు-గుఱ్ఱంలా పుంజుకోవాల్సిన తరుణం ఆసన్నమయింది అది ఇతను గుర్తించి కృషిచెయ్యడం, సాధించడం అంత కష్టం గాదు-అదే అతని శ్రేయోభిలాషులు ఆకాంక్షిస్తున్నారు కూడ నాటకాలంటే నల్లేరుమీద బండి**

“బాలమిత్ర సమాజం”మని ఒకటి చేసి యువ నటుల గిరీ చేస్తూ కూడా శ్రీ కాంతారావు మధుసేవ, చింతామణి, జయంతి జయపాలలాంటి నాటకాలు ఆడుతూ ఉండేవాడుట

ఇవాళకూడా ఆయన ట్రూపుతో నాటకాన్ని తెలుగువాళ్ల మెప్పును పొందేలా తీసుకెళ్ల గలననే ధైర్యంతో ఉన్నాడు “అలెగ్జాండర్” నాటకంలో ఒక సీను దేశరక్షణనిధికై తాలుకు చేసిన ప్రదర్శనలో అతను వేయగా ఈమధ్య హైద్రాబాద్, కర్నూలు, బెజవాడ ప్రేక్షకులు చూసే ఉంటారు ఈ ‘అలెగ్జాండర్’లో అతనే ఆ “అలెగ్జాండర్”— మంచి ధాటిగా డైలాగ్ చెప్పగల నటుడు శ్రీ కాంతారావు ఆ మెళకువల నెరిగినవాడు

అసలు ఈ నటునికి మళ్లీ ‘తారకస్థాయి’ రావడం ‘శాంతినివాసం’లోనే జరిగింది

‘శాంతి నివాసం’లోని పాత్ర బహు క్లిష్టమైనది దాని నతడు పోషించిన తీరు జనానికి చాలా చాలా నచ్చింది అందులో దేవిక ప్రక్కన ఇతడు నటించాడు శాంతినివాసం వేళకు శ్రీ కాంతారావు అన్నివిధాల ఢక్కా మొక్కీలు తిన్నవాడు, తెరమీద చాలినంత అనుభవం, అధ్యయనం, అభ్యాసం గల నటుడు — అదివరకు కథానాయకుడై సినిమాల్లో వచ్చినవాడు— కాని, అందుకాదు అవన్నీ చదివి కాదు జనం అతన్ని ‘శభాష్’ అన్నది— ఆ పాత్రలో లీనమై, దానిలోని ‘విలనీ’లా అగుపించే నైజాన్ని ‘విలనీ’ అనుకుని మోసపోయి విలన్‌గానో, క్రూరంగానో నటించకుండా ఆ పాత్రను అర్థం చేసుకుని దానికి కథలోగల స్థానం గ్రహించి నిగ్రహంతో ప్రాణప్రతిష్ఠ చేసినందుకు గాన, ప్రేక్షకులు అతన్ని “సుస్వాగత”మని ఆదరించారు

## ఏ వేషమేసినా..

అదే ఒక “మలుపు” శ్రీ కాంతారావు చెకచెకా సినిమాలు తీసే శ్రీ విఠలాచార్య సినిమాలలో పనిచేశాడు ప్రతిజ్ఞ నాటినుండీ ఉన్న కత్తి పట్టుకోగల, గుర్రంమీద కూచోగల అనుభవం ఈ సినిమాల్లో (“సహనటుడు శ్రీ రాజనాల సహాయ సహకారాల మూలంగా కూడా”) మంచి ‘వెంచర్’గా రాణించింది

కనకదుర్గ పూజామహిమే ననుకుంటాను (నే చాలారోజుల క్రితం చూశా) బహు గమ్మత్తయిన కథ కత్తులు, గుర్రాలు, రాజకన్యలు, దేవకన్యలు యక్షిణులు — యంత్రాలు, తంత్రాలు—అబ్బోరి అదో మాయాలోకం — అందులోనూ, కాంతారావే—ఖైదీ కన్నయ్యలోనూ కాంతారావే—

శాంతి నివాసంలోనూ కాంతారావే, శభాష్ రాజాలోనూ కాంతారావే — పైగా ‘అంబరీషుడు’ ‘నారదుడు’— ‘విష్ణుమూర్తి’ కూడా— ఇన్ని కాంతారావులు లేరుగాని, ఈ పాత్రలు వేర్వేరుగా ధరించి ధరించినవాడు ఒక్క కాంతారావే ఆయనలో సిన్సియారిటీ, నిగ్రహశక్తి ఓపిక, సాదాసీదా నైజం ఇన్ని వేషాలలో రాణింపజేశాయి

‘శ్రీ కాంతారావుకు 63వ సంవత్సరం చాలా మంచి లక్కీ ఇయర్’



లక్ష్మణుడు (లవకుశ)



“విష్ణుమాయలో”

"సాధారణంగా ఇంతవరకు ఎప్పుడూ 'డూప్ షాట్'లకు ప్రాకులాడలేదు. సాధ్యమైనంత వెంచర్ తీసుకొనే వాణ్ని నేను" అంటాడాయన

గుర్రాలెక్కడం, కత్తులు తిప్పడం గురించి చెప్తూ "మరేం ఫర్వాలేదులెండి, ఆ గుర్రాలకు మంచి ట్రైనింగ్ ఉంటుంది— గీసిన గిరి దాటవు మనల్ని దాటనివ్వవు అలాగే కత్తి పట్టడమా ? అది అలవాటైంది — అండర్‌స్టాండింగ్ ఉన్న నటులతో అదీ సునాయాసంగానే అవుతుంది" అంటాడాయన

## నిగర్వి · మొహమాటి !

నిగర్వి — మొహమాటం కూడా ఉన్నవాడే— సాధారణంగా నిర్మాతల మనసుకీ దర్శకుల మస్తిష్కానికీ ఇబ్బంది లేనడం గాని, 'షేకు'మీద 'షేకు'లడిగి (ఆ నిర్మాత లేదా దర్శకుడు తానై ఇస్తేమ, అడిగితేనూ తప్ప) 'సినీ బ్రహ్మల' ప్రాణాలను, రా—ఫిల్ము కొరుక్కుని—తినేడం గాని అతనికి వచ్చదు — "అంతా బుర్రలోనే సంఘర్షణపడి 'మూడ్'లోకి వచ్చేడం అలవాటు"

"చిక్కల్లా జానపదంనుంచి, పౌరాణికం నుంచి సాంఘికాల మీదకు వచ్చేసరికి ఆ మూడు మూడు వేర్వేరు లోకాలవడం వింపీ కాస్త ఇబ్బంది ఉంటుంది" అన్నాడాయన నవ్వుతూ

# తెరమీద-తెరవెనుక

శ్రీ కాంతారావును ఈ మూడు రకాల సినిమాలలోను ఆయన అవలంబించే పద్ధతులను గురించి అడిగితే ఆయన ఈ వేర్వేరు లోకాలకు, వేర్వేరు పాత్రలకు మనం బాధ్యులమని — దీనిని లక్షలాది రూపాయిలతో తయారు చేస్తారని — అనక లక్షలాది ప్రేక్షకులు చూస్తారని జ్ఞాపకం ఉంచుకోడం మొదటి సూత్రం అన్నారు

## నారికేళం: సాంఘికాలం

ఉదాహరణకి నారదుడు రావణాసురుణ్ని "లంకేశ్వరా ! నీ అంతవాడివి నువ్వు" లాంటి డైలాగు అంటాడు అనుకోండి ఇది పౌరాణిక "కాలం" "మాగట్టి కాలం" కాస్త భాషా వేషం కూడా "నారికేళం" — అంచాత కాస్త వ్యంగ్యమూ స్పష్టతా మిళాయించి ఇంగున డైలాగు అంటే అదేచాలు అదే "సుబ్బారావు వేషం అప్పారావును ఒకానొక సాంఘికంలో" "నికేమిటోయ్ ! నీ అంత వాడివి నువ్వు ఊ" అంటే — అక్కడ— ఈ సాంఘికాలానికనుగుణంగా తేలిగ్గా డైలాగును విసరాలి విసిరిన డైలాగు తర్వాత, తొలి పురాణంలో ఓ నవ్వు క్లోజప్పులో అగుపించి— మెల్లిగా ఫేడవుట్ అవుతే—యిక్కడ ఆ విధమైన వాచ్యం వ్యాఖ్యానాల జోలి లేకుండా "సైలంట్ ఎక్స్ప్రెషన్‌తో కొంచెం స్పీడుగా వెళిపోవచ్చును"

ఇలాగే పాత్ర తనెరిగి పాత్రనెఱిమెరిగి, సందర్భమెరిగి— సముచితంగా దర్శక నిర్మాతల అభిరుచులకనుగుణంగా నెట్టుకు వస్తేనే— అది "కెరీరు" అయితే ఈ "కెరీరు" ఇక్కడితో పూర్తి అవుతుందా ?" దీన్ని జనం మెచ్చుతారా ? ఈ 'కెరీర్'కు కళాకారుడు తనదైన తపస్సునూ, అనుభవ అధ్యయనాలతో సంతరించుకొన్న సాధనను ధారపోసి, తనదైన ఒక కొత్తదనాన్ని ఆ పాత్రలకు అంకితం చేస్తే, అదే అతని "కెరీర్"; అతని 'కళారాధన' అది ఇవాళ నటుణ్ని నిలబెడుతుంది రేపు కూడా నటునికి అవకాశమున్నదని హామీగా పలుకుతుంది ఆ కృషి శ్రీ కాంతారావులో ఉన్నది

**అధ్యయనంతో క్రమశిక్షణను, చిత్తశుద్ధిని పెంపొందించుకోగల సంస్కారమున్నది శ్రీ కాంతారావ్‌లో ఈ నటుడు అతి త్వరలోనే నూరు చిత్రాలు పూర్తి చేసుకోవాలని ఆశిస్తున్నాను ఇతని 'నట జీవితం' మూడు పూలూ, ఆరు కాయలుగా ఫలించాలని ఆకాంక్షిస్తున్నాను**



**ఇటీవలి ఇతని చిత్రాలలో 'ఎదురీత' ఒకటి మంచిపేరు తెచ్చింది.**

# వీరాజీ

సీరియల్ ప్రారంభం

నగరంలో సాయంకాలమయ్యింది! ఇంకా సూర్యుడస్తమించలేదు! అన్ని మ్యాటనీలు విడిచిపుచ్చలేదు. దీపాలు అక్కడా అక్కడా వెలుగుతున్నాయి!

'నేనంటే ఎంత నిర్లక్ష్యం? ఇంకా నేను గ్రుంకిపోకండానే ఈ నగరవాసులు దీపాలతో నన్ను వెక్కిరిస్తున్నారే' నన్నట్లు పశ్చిమాద్రిన సూర్యుడు కందిపోయాడు. అతగాడి కోపానికి అల్లనల్లన విహారంచేస్తున్న కొన్ని మేఘాలు సైతం గభిక్కున కందిపోయాయి!!





నగరంలో సాయంకాల మంటే ఆఫీసులు వదలి గుమస్తాసకులు ఇళ్లుపారేవేళ; నిరుద్యోగ ప్రిట్టలు షైరుపాగేవేళ! మ్యాటనీలు విడిచే గోల!!

అందంగా ఉండాలని అన్నిషాపులూ, రంగు దీపాల మోహాలు వెలిగించుకున్నాయి. అందంగా ఉండాలని బాటసారుల మోహాలు సైతం ప్రయత్నిస్తాయి. ఇది నగర లక్షణాల్లో ముఖ్యమైనదని లాక్షణికులు గ్రంథస్తం చెయ్యాని నిజం!

ఉసూరుమని ఆఫీసు మెట్లుదిగి, బరువుగా రోడ్డు మెట్లు ఎక్కుతున్న మోహన్రావుని, అందమైన భాస్కరం ఉషారుగా "ఒరేయ్! మోహన్.... హలోవ్.... ఇట్రా.... ఇటూ" అంటూ పలకరించాడు.

"అరె, మాంచి పూలరంగడిలా ఉన్నావురా భాయ్! శలవులా? ఎప్పుడొచ్చావ్.... ?" అంటూ భాస్కరాన్ని పలకరించాడు మోహన్రావు.

అంతలో దూసుకున్న లారీని తప్పించుకుని అది రేపిన దుమ్మును అరచేత విదిలించుకుని,

## రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలతో కాక విడిగా స్టాంపులు పంపే వారి రచనలు తిప్పి పంపడం సాధ్యం కాదు. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కూడా లేదని గుర్తించ ప్రార్థన.

మిత్రులిద్దరూ ప్లేట్‌ఫాం మీదకు లంఘించారు !

అరగంటలోపల సాయం సందడి తిరుగు ముఖం పట్టింది. గడియారం రెండు ముళ్ళూ ఏడుకేసి పరిగెడుతున్నాయి.

భాస్కరం తన మిత్రుడికి యూనివర్సిటీ విశేషాలు చెబుతూంటే.... మోహన్రావు గుమాస్తాగిరీలో ఆర్నెల్లకే వాలిన భుజాలను నిలబెట్టాలని వృధా ప్రయత్నం చేస్తూ విన్నాడు.

అంతలో టక్కున జ్ఞాపకం వచ్చింది. భాస్కరానికి.... ఆ వేళ పద్మావతి వస్తుందన్న సంగతి.

"ఒరే భాయ్ ! నన్ను వదిలెయ్యాలి.... మళ్లీ రేపు కలుద్దాం.... ఇప్పుడు అర్జంటుగా వెళ్ళాలి." అంటూ క్షమాపణ చెప్పుకుని స్టేషనుకేసి గబగబా నడిచేడు భాస్కరం.

* * *

ఐదు మార్గాల రైలుకూడలి ఆ నగరం! ఆ రైల్వేస్టేషన్లో, అయిదునొక్క ప్లాట్‌ఫారాలున్నై!

"ప్లాట్‌ఫారా లెంతమంచివి ! కొందర్ని కలుపుతాయి !"

"ప్లాట్‌ఫారా లెంతచెడ్డవి ! కొందర్ని విడదీస్తాయి!"

క్యూలో నిలబడడం నాగరికత కాకపోగా, బలవంతుడైన వాడికి నామోషీ కూడాను !

టిక్కెట్ల కౌంటరు దగ్గర ఉన్న పదిమందీ ఒకర్ని ఒకరు పెనవేసుకుని ఉండగా, ఒక మెడా మరో భుజానికీ మధ్య యేర్పడిన ఖాళీలో నించి భాస్కరం చెయ్యిదూర్చి

"ప్లాట్‌ఫారమ్ ప్లీజ్!" అని గొణుక్కున్నాడు. అంతేమరి.... భాస్కరం యూనివర్సిటీలో ఎంఎస్సీ చదువుకుంటున్నాడు !

బుకింగ్ క్లార్క్ ఇక్కడ ఈ కిటికీలోని వ్యక్తులను వదలి, మరో కిటికీ కంతలోనుంచి ఇంకో "క్యూ"లాంటి దాన్ని అచ్చు వేదాంతిలాగ తిలకిస్తున్నాడు!

"మాష్టారూ ! మాష్టారూ !" అన్న కేకలకి తాపీగా 'ఆఁ' అన్నాడు ఎట్టకేలకు తనవని చూసుకుందికే నిశ్చయించుకుని.

భాస్కరం చేతిలోని తెల్లని అర్ధరూపాయి కాసు అతని అరచేతి చెమటకి తడిసి పోయింది. మోహనకూడ చిరు చెమటలు చిమ్మేయి.

"అంతా రూపాయిలు అర్ధలూ తెస్తారు. చిల్లరలేదు."

కర్కోటకుడైన డాక్టర్ మొహంలోకి చూసినట్లు చూశాడు భాస్కరం, బుకింగ్ క్లార్క్ మొహంలోకి.

"ప్లీజ్ ! ఐవిల్ హావ్‌టురష్.... నేను పరుగెత్తాలి. కావాలంటే ఛేంజి రిటన్‌లో ఇవ్వండి.."

అపూర్వమైన త్యాగం చేయబోయే వాడిలాగ అర్ధరూపాయి తీసుకుని ప్లాట్‌ఫారం టిక్కట్ విసిరేశాడు గుమాస్తా.

భాస్కరం దూసు కున్నాడు.

మెట్లన్నీ గబగబా యెక్కి, బ్రిడ్జిమీద, దబదబా పరిగెత్తి దిగి రెండో నెంబరు ప్లాట్‌ఫారంకేసి ఉరుకుతీద్దామని— అంతలో మానేశాడు.

బోసిగా ఉంది ప్లాట్‌ఫారమ్ !

చివుక్కుమంది అతగాడి మనస్సు.

# ప్రేమకు పగ్గాలు

రైలు లేటు !—

ఇది తత్ధర్మకాల వాక్యమే ! !

అడావుడిలో రాగా, వూడిన బూటు లేసులను బిగించుకున్నాడు.

తను రెండు నిముషాలు ఆలస్యం ఐనందుకెంత ఆందోళన పడ్డాడు ? కాని రైలు బండి కెందుకు ఆందోళన ? అదెవరికోసం తహతహలాడుతూ రావాలిగనుక ?!

తను పద్మావతిని చూడాలని వచ్చేడు.

"దయజేసి వినండి: మదరాసుబోవు మెయిలు : మరి తొంబది నిముషాల్లో రెండవ నంబరు ప్లాట్‌ఫారమునకు వచ్చును"

తెలుగుభాషలాంటి అనౌన్సుమెంటు వినవచ్చింది లౌడుస్పీకరులో.

"ఈ అనౌన్సుమెంటు వింటే తెలుగు భాషను 'ఇటాలియన్ ఆఫ్‌ది ఈస్టు' అనుకుంటారూ ఎవరైనా ?"— అని తలపోస్తూ : కాళ్లీడ్చుకుంటూ హిగ్గిన్ బాదమ్స్‌కేసి దారితీశాడు భాస్కరం.

"కాశ్మీర్‌ను సందర్శించండి"

**ఓ రచయిత తన భార్యామణితో సహా తన నాటకాన్ని చూసేందుకు వెళ్లాడు. నాటకం సగంలో ఆవిడ గుక్క ఆపుకోకుండా ఏడ్వటం మొదలెట్టేసరికి, 'నే నింక నాటకం రాయనులే ఏడవకు అని సముదాయించాడట.' మళ్లీ ఇంతవరకు ఆయన నాటకం రాస్తే ఒట్టు.**

బంగారయ్య (ఎనమలకుదురు)

"భారత దేశాన్ని పరిశోధించండి"

గవర్నమెంటువారి రంగురంగుల పోస్టర్లు అగుపించేయి.

'తనూ పద్మా ఇంచక్కా కాశ్మీర్ వెళితే బాగుండును....'అనిపించింది.

హిగిన్ బాధమ్స్ పుస్తకాలను కలియజూసేడు. గడియారం చూసుకున్నాడు.

ఒక రెండు జెడల నైలాన్ సింధీ సుందరి బొద్దుగా ఉన్నది; పుస్తకాలు తిరగేస్తూ ఉన్న దల్లా— మరిరెండు వరుసల కవతలి పుస్తకాలను సవరించసాగింది భాస్కరం తన చెంతకు రాగానే....

పాపం! .... అక్కడి సేల్సు గుమాస్తా ఆవిడను కాదనలేక ఆముదం తాగుతున్నట్లు నించున్నాడు.

"ఉహ్ఁ" మని భుజాలు విరుచుకున్నాడు భాస్కరం.

తను పద్మావతి కోసరం వచ్చానని ఈమెకు తెలియదుకాబోలు !

తన పద్మ ఎంత అందంగా ఉంటుందో ఈమెకు అస్సలు తెలియదు :

"బ్లిట్జ్" పేపరు కొనుక్కుని దాని పేజీలను పటపమని ఆమెకేసి దులిపి ఫాన్ క్రిందగా గబ పాసింజరు బల్లమీదకి నడిచి, చతికిలబడ్డాడు.

'బ్లిట్జ్' ఆఖరి పేజీలో "దొరసాని" బొమ్మ ఉంది. తెగనవ్వుతోంది. దాని క్రింద 'నవ్వులొలికి బోస్తున్నది తార ." అని రాసికూడ ఉంది.

"ఏడ్చినట్లుంది" చప్పరించేడు.

తన పద్మ కళ్లతో నవ్వగలదు! ఆ నవ్వు ముందు, ఇదొక లెక్కా ?

పద్మ.... పద్మావతి ?....

ఎన్నాళ్లయిందా పిల్లని చూసి !.... ఎన్ని రోజు లయ్యింది మాటాడి ! !

ఆ అమ్మాయి కంఠంలో జల్తరంగుణలున్నై ! !

ఆమె చూపుల్లో విద్యుత్ కిరణాలుంటాయ్!!

భాస్కరం గడియారం చూసుకున్నాడు.

"అవసరమైనప్పుడు గడియారాలున్నూ హం గమనమే: పదిహేను నిముషాలు మాత్రమే గడిచేయి

ఐతే ఆ కొద్ది సేపట్లోనూ అతగాడి పరిసరాలన్నీ పోల్చలేనంతగా మారిపోయాయి!

'హిగ్గింబాధమ్సు' దగ్గర బొద్దుపాటి సుంద లేదు ! నలుగురు కొత్తమ్మాయిలూ, ఒక బొద్ద పాటి — ఇంకో బక్కపాటీ మనుషులు.

లైసెంసు కూలీలు అలాగ దింపుతూ ఉన్నారు సామానును.

కుంపటీ, విసనకర్ర మొదలుకొని 'టేబిల్–ఫాన్'దాకా ఉన్న సరంజామా అంతా దింపుకొ మెయిల్లో ఎక్కదామని చతికిల బడ్డారు తన కు ప్రక్క నెవరో ! !

"మొత్తం ఇల్లు తెచ్చేసుకున్నారు" అని జా పడ్డాడు భాస్కరం. మళ్లీ నవ్వుకున్నాడు తనలో.

ఆవిడ చంటి పిల్లను సముదాయించి పాలుకుడు తూనే, ఎడపిల్లను చేరదీసింది. పెద్దపిల్లలను "రైల వస్తుం దటు వెళ్లకండ్రా!" అని హెచ్చరించింది

"ఇదుగో ! మిమ్మల్నే.... బాబిగాడి జోళ బుట్టాలో వదిలీలేదుకదా !"

"చంటిదాని పాలసీక ఏదీ ?" అని అడు తున్నది భర్తని.

జీవితాన్నంత బాధ్యతగా, చక్కగా అనుభవిం వాళ్లమీద తనెవరు జాలిపడేందుకు ?

"ఇవతల కొత్త దంపతులల్లే ఉన్నారు. అతగాడు పేపరు చేత పుచ్చుగుని పచార్లు స్తున్నాడు? "

ఆ పిల్ల కూచున్న భంగిమ బాగుంది !!

అంతలో ఏవో అనౌన్సుమెంట్లు!

దడదడా అవతల ప్లాట్‌ఫారమ్ మీదికి రైళ్ళు

...ఇవతల ఇంకో రైలు ! !

జనం !

గందరగోళం ! !

అంతలో కాస్త తెరిపి !

"అయ్యో ! ఆ ప్లాట్‌ఫారమ్‌టా!!" అని ఆర న్నెక్కి పెట్టెలతో ఒక ప్లాట్‌ఫారానికి మారు ఇంకో దానిమీదికి తప్పుదారి తొక్కిన ప్రయా కుల యాతన.

నడిచే ఫలహార శాలలు ! !

వీటిమధ్య 'అతగాడెవరో మిలిటరీ వాడం ఉన్నాడు. హోల్డాలు విప్పుకుని పడుకుని నై గుర్రుకూడా పెడుతున్నాడు!

"హరి భగవాన్ ! ఈ ఆడవాళ్లింతే ! అ

వాళ్ళ చూడు .... రైలు ప్రయాణం కదా ! అందులోనూ; మెయిలు ప్రయాణంకదా . . అలా చింతపండు ముద్దల్లాగ సగలన్నీ దిగవేసుకుని.... పట్టుచీరె, ముప్పాతిక పర్ణాణం ధరించి.... రావడం ఏమిటి ?"

"సరిపోయింది ! కూచోనయ్యా అంటే, ఆ యువకుడు ప్యాంటు నలిగిపోతుందన్నట్లు మ్యాన్‌పేపరు మీద అంత మొహమాటంగా కూచుంటాడేం? మరి మెయిలెలా ఎక్కుతాడు ?"

భాస్కరం నవ్వుకున్నాడు.

తనూ అంతే... మెయిలుదాకా ఎందుకు; పాసింజర్ కూడా ఎక్కలేడు.

పద్మ ... పద్మ ! తనను చూడగానే ఏమంటుంది.

క్రాపింగు సవరించుకున్నాడు. దుస్తులు సవరించుకున్నాడు. లేచి అమాంతంగా పచార్లు చేసి, తన జాగా నెవరో ఆక్రమించుగోడంతో, మరో సిమెంటు బెంచీకోసరం వెళ్ళి అక్కడ కూచోడం మనస్కరించక.... ఆ కొసకంటా పచార్లు చేశాడు.

'రైలు బళ్ళు గమ్మత్తైనవి!'

'ఎద'నేదో ఆనందం కలిగింది ! !

'ప్లాట్‌ఫారమ్‌లింకా మజా అయినవి!'

వెనకనించి, పోస్టలు ట్రాలీ ఢీకొన్నంత పని జేసింది ! !

గడియారం చూసుకుందామని పూర్తిగా చూడకుండానే దూరంగా చీకట్లోకి పట్టాల వెంట దీపాల కేసి రైలు వచ్చేస్తున్నదేమోనని చూశాడు.

ఇంకా అరగంట ఉంది.

పద్మని చూడగానే ఏమంటాడు తను ?

నవ్వుకున్నాడు. తన చిన్మయానందానికి దూరంగా నించున్న కన్నెపిల్ల సిగ్గుపడ్డది. సిగ్గుపడ్డాడు భాస్కరం కూడా.

ప్లాట్‌ఫారం అంతా తండోపతండాలుగా నిండిపోయింది.

రైలు వచ్చేవేళ ఐనకొద్దీ సందడి ఇనుమడించింది.

'పెరుగుపొట్లాలు....సాంబరుపొట్లాలు' : దొంతులు దొంతులు; ఎన్ని క్షణాలు కావా లన్నీ ఉడాయించుకుపోడానికి.

"విజయవాడ వస్తోంది. భోజనం దొరుకుతుంది" అని 'ఔటర్' దగ్గర్నించీ ఎంతమంది అరవ, హిందూస్థానీ వాళ్ళ మెడ లివతలికి రిక్కించి ఆవురావురని చూస్తూ ఉంటారో ! !

కాని, తన పద్మ ?

తన పద్మ తనకోసరం చెయ్యి వూపుతుంది! అవతలనించి ఒక రైలు వెళ్ళిపోయింది. ! మరో అవతల ఇంకోటి వచ్చింది ! .. ఇవతల ఇంకోటి రావల్సి ఉంది.... అలాగే క్షణాలు కరిగి పోయేయి !

"భాం !" మంది అల్లంత దూరాన మెయిలు.

'మెయిలు!'... 'మెయిలు...!' 'కూలీ!' 'కూలీ!' జాగర్త.... భద్రం.... 'కమాన్'.... 'పదండి పదండి'.....

దడదడలాడుతున్నాయి పట్టాలు. భాస్కరం గుండెల్లో ఆ శబ్దం ఉద్వేలంగా, వేగంగా వినబడుతున్నది.

అక్కడే నిలబడ్డాడు. ప్రతీ కిటికీ—ఫ్రేములోనూ రెండేసి, ఒక్కొక్కటి తలకాయలు. ఆ వెనుకాతల అంతా మనుషులు...

# ప్రేమకు పగ్గాలు

"పద్మ !.... పద్మ ! ?... ఊహూఁ..."

ఫస్టాగాసు !....

సెకండ్...సెకండ్... పైలట్ క్రూ... ఆర్మీ. . ఆరెమ్మెన్.... లేడీసు.... దాంతోటే వెళ్ళా యతని చూపులు.... లేదు ! పద్మ అగుపించలేదు.. అతని మనసు మాత్రం పద్మ రాలేదని ఒప్పుకోలేదు.

ఎటు పరిగెత్తి వెతకాలో అర్థం అవలేదు.

పద్మ రావాలి. గుంటూరు రైలెక్కాలి. పద్మ రాక తప్పదు. వచ్చే ఉండాలి అటూ ఇటూ గాలించేశాడు భాస్కరం.

చెమటలు పోసుకున్నాడు. ఏమయింది చెప్మా!' 'ఆవేళ మెయిలుకేగా వస్తాన'ని రాస్త.... తన కోసరం చూసి... ఆ ముందు కంపార్టుమెంటులో ఉందేమో.... అక్కడ దిగిపోయి ఉంటుంది.

భాస్కరానికి నిరాశకలిగింది. నిస్పృహ పెనవేసింది. ఉడుకుమోత్తనం వచ్చింది. ఏడుపు వచ్చింది.

"పద్మ అగుపించలేద"ను కున్నాడు. అంతే గాని "రాలేదన్న"మాట అనలే దతని మనస్సు.

'ఆ ముందు కంపార్టుమెంటులోనూ లేదు. ఈ వెనక్కంపార్టుమెంట్‌లోనూ లేదు.' విసుక్కున్నాడు.

## 2

"మరి వ్వాక పద్ది నిముషాల్లో...." మెయిలు వెళ్ళిపోతుందని అరవ కంఠం ఎనౌన్సుమెంటు.

"అరె ! అక్కడెవరు చెప్మా ... పద్మలాగుందే ?" భాస్కరానికి అరక్షణంలో ప్రాణం లేచివచ్చింది

"ఆఁ. అది పద్మ సూట్‌కేసే .. పోయిన సారి దాన్ని చూసినట్లు జ్ఞాపకం"—

మరి అట్నుంచి పట్టాలు దాటి రావల్సిన అవసరం ఏమొచ్చింది. అంతేగాదు, ఆ రెండో అమ్మాయి ఎవరు ? చూసినట్లుందే....

'ఔను' 'కాదు'ల మధ్య వూగిసలాడిం దతని మనసు.

ఆ రెండో అమ్మాయి కూలివాని వెనకాతల ఛెంగున పట్టాలను దాటి ప్లాట్‌ఫారంమీదికి ఎక్కిపోయింది.

పద్మావతి, భాస్కరం దగ్గరపడుతుండగా, ఆ రెండో అమ్మాయి — సాయంతో ఎక్కుతున్న దల్లా మళ్ళా పడినంత పనిజేసి పట్టాల మీదికి దిగిపోయింది.

"అయ్యో ! ఇలాగయితే ఎలాగే.... అందుకే టెన్నిస్ ఆడమంటా నం"టూంది రెండో అమ్మాయి; పద్మని రెక్కపుచ్చుగుని మీదికి లాగుతూ.

భాస్కరం దగ్గరకు వచ్చేడు.

పద్మావతి, మీదికి ఎక్కగలిగింది ఎట్టకేలకు "అమ్మయ్య ! ప్రాణాలు పోయాయి" అన్నది పద్మావతి భాస్కరాన్ని చూసింది.

"పద్మా !" అందామనుకున్నాడు. గట్టిగా అరుద్దా మనుకున్నాడు. పెదాలు విడలేదు భాస్కరానికి.

పద్మావతి మిలమిలా మెరిసే కళ్ళతో; ప్రయాన పులకించిన ఆనందమంతా చూపించదలన్నట్లు చూస్తూ ఉండిపోయింది రెండు క్షణాలు. ఆమె చూపు లతన్ని గాఢంగా పెనవేసి కౌగలించినట్లు ఉక్కిరి బిక్కిరయ్యింది భాస్కరానికి.

ఎదను పారిజాతాల జడివానయ్యి కురిశాయి ఆ అమ్మాయి చూపులు!

అతని చుట్టూ విద్యుల్లతల్లా మెరిశా యా దృక్కులు!!

"మరి ఇట్నుంచి దిగుదామా అంటే, రైల





"ఈ అత్యవసర పరిస్థితిలో మనమందరం ఎప్పుడూ మెలకువగా ఉండాలి."

## భారీయెత్తున దేశరక్షణకు ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి



## ప్రేమకు పగ్గాలు

వెళ్ళిపోతుందేమోనని భయమేసింది. దిగడానికి ఇంత పిసరేనా సందులేదు. అందుకని ఇదో మా 'సురేఖ' చెప్పినట్లు అవతలవేపు దిగిపోయావ్." పంజాయిషీ చెప్పుకున్నట్టు— తప్పు చేసినట్లు మాటాడింది పద్మ.

"మంచి పనే చేశావ్.... రాలేదేమోనని కోపం తెచ్చేసుకున్నాన"న్నాడు బోలెడంత ఆనందంతో భాస్కరం.

"సురేఖ మా ఫ్రెండు.... గొప్ప గడుగ్గాయి. ఆటలంటే ఫస్టు...." పరిచయం చేసింది పద్మ.

ఆ క్షణం కోసరమే ఎదురు చూస్తున్నట్లు సురేఖ "నమస్కారమండీ" అన్నది.

అని వెంటనే "మీరు రారేమోనని మా పద్మం ఎంత ఇదైపోయిం దనుకున్నారు?" అన్నది చనువుగా.

చాలా చలాకీగా ఉంది సురేఖ. ఒక చేతికి వాచీ మరో చేతికి రెండే గాజులు వేసుకుంది. నుదుట బొట్టు ఉందో లేదో, భాస్కరం గమనించలేకపోయేడు. ఆ పిల్ల నడుం మరీ సన్నంగా ఉంది. మెడలో ఒక్క నగ లేదు. ఓ విధంగా చెప్పాలంటే బ్యాక్‌లెస్ జాకెట్ వేసుకుంది. ప్రయాణంలో నలిగినప్పటికీ, అంత బడలికలోనూ ఉత్సాహంగా ఉంది. పొడుం — రంగు చీరె సిల్కు దయివా, భుజం మించి జారని పయిట వేసుకుంది.

"మరి, మీరు భోజనం, ఫలహారం యేమీ చెయ్యరూ?... ఆ గుంటూరు—ప్లాట్‌ఫారం మీదికి వెళ్ళాక ఏం దొరకదు." కూలివాడి విసుగు మొహం చూసి కొంచెం తొందరపడ్డాడు భాస్కరం.

"నాకేం ఒద్దు బాబూ! ఇంటి కెళ్ళిపోతాగా" అంది పద్మ.

"తోవ కడాకా ఇదేనండీ వరసా ! .... తిండి వద్దంటుంది. మళ్లీ ఉద్యోగం చేస్తుందిట రేప్పొద్దుటా" సురేఖ నవ్వింది పద్మని అనురాగంతో చూసి.

"పదండి; ఈ సామాను వెయిటింగ్ రూమ్‌లో పెట్టిస్తాను. యూ కెన్ టేక్ మీల్స్...." అన్నాడిద్దర్నీ ఉద్దేశించి.

భాస్కరాని కా క్షణంలో ఏనుగంత బలం, కొండంత ధైర్యమూ ఉన్నాయి.

"నో.... నో.... నే నీ ఊళ్లోనే ఉండిపోతున్నా.. దానికే భోజనం...." సురేఖ వారించింది.

"ఔనండీ ! సురేఖ వాళ్ల "ఆంటీ"గారిదీ వూరే .... అక్కడికే వచ్చింది గాంధీనగరంలోనట" చెప్పింది పద్మ.

"ఏమయితే నేం ? ససేమిరా నే నా రద్దీలో ఏమీ తినలేను బాబూ...." అని హఠం—పట్టింది పద్మావతి.

"అంతగా ఐతే సురేఖ, నేనూ కాఫీ తాగుతాం... అదీ, ఆరో నంబర్ ప్లాట్‌ఫారంమీద — ఉండదా ఏం ?" అన్నది పద్మావతి.

భాస్కరం బలవంతం చేయలేకపోయాడు.

సురేఖ పెట్టె, పద్మ పెట్టెకూడా, ఆరో నెంబరు ప్లాట్‌ఫారంమీద ఉస్సురని పడివున్న గుంటూరు రైల్లో; ఖాళీగా ఉన్న ఆడవాళ్ల పెట్టెలో పెట్టి తన పని ముగించుకున్నాడు కూలివాడు.

సురేఖ మాటల సందడిలో అది గమనించవే

లేదు. కూలివాడికి డబ్బులిచ్చి వాడిని పంపించే దంలో ముగ్గురూ పోటీపడ్డారు.

చివరికి ఆ పోటీలో భాస్కరమే నెగ్గాడు. అటుతర్వాత అడావుడిగా వెళ్లి, ఏమీ తేలేక, అరటి పళ్లలాంటి ఓ అరడజనూ, కోవా బిళ్లలని చెప్పేవి ఉండే ప్యాకెట్లూ, ప్యారీ కంపెనీ స్వీట్లూ పట్టుకొచ్చేడు.

సురేఖ నవ్వుతూ "మొత్తానికి పద్మని చంటి పిల్లని చేసేశారం"ది.

"నో నో.... మొదటే మనవి చేసుకున్నాను.... మరీ హారం; పడితే ఏం చేయను? ... మీకోసరం కూడా అవే తెచ్చాను...." భాస్కరం సాధ్యమయినంత నవ్వుమొహం పెట్టేడు.

కాని అతగాడికి పద్మావతి పీక్కుపోయిన కళ్లల్లోకి చూస్తే ఒళ్లు మండిపోయింది; ఉదయంనుంచి "మాడు"తూ ఉండి ఉండాలి.

"మీరు ఉదయంనుంచీ ఉపవాసం చేస్తున్నారు కదూ ?" కోపంగానే అడిగేడు.

"చిత్తం" అన్నది పద్మ అరటిపండు ఒలుచుకుంటూ.

"ఇదో ఈ రాణీగారివల్లే .... లేకపోతే నేను దర్జాగా రాజాలా భోజనం చేద్దును...." సురేఖ ఉరిమి చూసింది స్నేహితురాలిని.

"పోనీ ఇప్పుడెందుకూ్కడదూ !" పద్మ, భాస్కరం కేసి కొంటెగా చూసింది. సురేఖ గభిక్కున రైలు దిగిపోయింది.

"ఇంకా నయం; గుంటూరు రమ్మన్నావ్ కాదు ? మా దొడ్డమ్మ ఛంపేస్తుంది .... కని పెట్టుకుని ఉంటుందం"ది నవ్వుతూ.

రైలు కూసింది.

"అయ్యో! నా సూట్‌కేసే పద్మా .... మనం చూసుకొనే లేదు....అదో అదేం పి సూట్‌కేస్ క్రింద" నన్నది సురేఖ.

పద్మ "అయ్యో ! సారీ" అని అందివ్వబోగా భాస్కరం గభిక్కున వారించి:

"డోంట్యూ డూ ఇట్" అంటూ, తానే దింపాడు. అతగాడు చెయ్యి వూడిపోయినట్లు నటించడంతో "ఓ ! సారీ, ఓన్లీ ఇంగ్లీష్ బుక్స్" అన్నది సురేఖ.

"అంతేనా లేక "సీస"పచ్చు లేమేనా తెస్తున్నారా ?" నవ్వేడు భాస్కరం.

అంతలో రైలు కదల్తానని కదిలి వూరుకుంది.

"అయితే పద్మా ! ఇంటి కెళ్లి ఫోంచేస్తానంటావు ?" భాస్కరం ప్రశ్న.

"ఉత్తరం రాస్తా"నని పద్మ జవాబు.

"పద్మా ! ఈ రైలు గుంటూరు ఈ రాత్రికి చేరాలి గాక అని ప్రార్థించు" అని కేకేసింది సురేఖ.

"తారీఖు మారనివ్వదులే...." అని పద్మావతి అంటూన్నప్పటికీ, ఆమె కళ్లన్నీ భాస్కరం మీదనే ఉన్నాయి.

భాస్కరం రైలు వెళ్లిపోయేదాకా చూస్తూనే ఉన్నాడు.

"మీ దొడ్డమ్మగారి ఇల్లెక్కడన్నారు?"భాస్కరం బ్రిడ్జి మెట్లెక్కుతూ అడిగేడు.

"గాంధీ—నగరంలో నండీ...."—

బహుశా సురేఖ, భాస్కరం గురించి పద్మావతి ద్వారా చాలా విని ఉండాలి : ఆమె పొగడ్తలకు, అలంకారాలకు ఏమాత్రం తూగగలడా? ఇతగా డన్నట్లున్నా యామె చూపులు.

"అచ్ఛా ! నేను ఇటు హనుమాన్‌పేటలోకి వెళ్లాలి .... అక్కడిదాకా రానా !" అడిగాడు మర్యాదగా భాస్కరం.

"అబ్బే ! అక్కర్లేదండీ ! రిక్షాలో వెళ్లడం నా కలవాటే— మా 'లేట్ అంకుల్' మీరు ఎరిగే ఉంటారు; జగన్నాథరావుగారు చాలా కీర్తి ఉన్న లాయరు. మా ఇల్లందరికీ తెలుసు."—

"ఆఁ ఆఁ వినే ఉంటాను లెండి...."

గేట్ దగ్గర భాస్కరం ప్లాట్‌ఫారం టిక్కెట్టు ఒక్కటీ పడేడంతో; టి. సీ. అప్పటిదాకా ఆ ఇద్దరి మీద ఉన్న అభిప్రాయం మార్చుకున్నాడు. "కిహిక్కిహీ" మని దగ్గేడు—

"రిక్షా!" అని కేకవేసి సురేఖ ఎక్కి కూర్చున్న తర్వాత "గుడ్‌నైట్!" అన్నాడు భాస్కరం.

"పద్మకి ఉత్తరం రాయండీ .... నా పేరకూడా ఓ కార్డు రాయమని...." సురేఖ నవ్వుతూ చెప్పింది.

"సరిపోయింది ! ఆ రికమండేషను మీరే నాకు చెయ్యండి." — రిక్షా 'క్రింగ్ రింగ్' మని వెళ్లిపోయింది.

స్టేషన్నుంచి గాంధీనగరం మీదుగా గవర్నరుపేటకి వెళ్లే రోడ్డు ఎప్పుడూ సందడిగానే ఉంటుంది గానీ, రాత్రి పదిగంటల తర్వాత సందడి నేరు.

రిక్షాలు తప్ప మరో బాపతు బళ్లు అగుపించవు.

భాస్కరంల్లాంటి యువకులను పదేళ్ల నిండని పసికందులు "రూమ్ కావాలా ?" — "అయ్యా ! హోటల్ కావాలా ?" అని అడగడం భాస్కరాని కేం కొత్త గాదు.

పదేళ్ల కుర్రాడు ఈల—వేసి, కన్నుగొట్టి — పలకరించి తన పడక సౌకర్యం గురించి భోగట్టా చేసినప్పుడు భాస్కరంలాంటి యువకులు విసుక్కుంటే తప్పుకూడాలేదు.

కాని భాస్కరం విసుగుతోబాటు సిగ్గుకూడా పడతాడు. అదే ఆశ్చర్యం.

భాస్కరానికి సురేఖ రిక్షా వెళిపోయిన తర్వాత భయంకరమైన ఆలోచనలు వచ్చేయి.

సురేఖ ఎవరు తనకి ?

'పద్మ ఫ్రెండు'—అంతేనా ! సురేఖ ఈ దేశంలో మర్యాదస్తులమని గర్వపడే కుటుంబంలోనించి వచ్చిన ఆడపిల్ల. సురేఖతో తన భయం వ్యక్త పరుస్తే ఏమంటుంది ?

నవ్వుతుంది ..... "మమ్మల్ని మీరు "ఇన్‌ఫీరియర్"గా చూడకండి .... ఆ మాత్రం స్టేషన్ నించి ఇంటికి వెళ్లలేకపోతే ఎలాగం"టుంది.

భాస్కరం పద్మ గురించి ఇల్లు సమీపించే వరకూ ఆలోచించలేకపోయేడు.

బెజవాడ బాగుచేసే బాధ్యత అంతా తనమీదే ఉన్నట్లు బాధపడ్డాడు. అంతలో ఇల్లు వచ్చేసింది.

[ఇంకా వుంది]

# మీరూ ఓ కథ రాయండి!

21—వ పేజీ తరువాయి

...టికి పోవటమంటే బెంగగానే ఉంది. బజారంతా తిరిగి, బాగా పొద్దుపోయాక ఇల్లు చేరాను.

వెళ్తూనే కుర్చీలో వాలిపోయాను.

ఆమె నవ్వుతూ ఎదురైంది.

నా నుదురు ముడతలు పడింది.

ఏదో చెప్పబోయి, ఆమె ఆగిపోయింది.

ఆమె చెప్పేది నాకు తెల్సు. వినటం ఇష్టం లేక మొహం తిప్పుకున్నాను.

ఆమె కుశల మడిగింది.

తలనొప్పిగా ఉందన్నాను.

జ్వరముందేమోనని చెయ్యివేసింది.

నేను నవ్వబోయి ఊరుకున్నాను.

తర్వాత కాస్సేపు మురిపించుకుని, విస్తరి పూర్తి చేశాను.

గదిలో నేను పేపరు చూస్తుండగా, ఆమె వచ్చి ఎదురుగా కూచుంది.

"మీ కిక శ్రమివ్వ దల్చుకోలేదు.... నేను కథ పంపించాను." అందామె.

కొన్ని క్షణాలు విస్మయంలో ఉండిపోయాను. ఆ మాటలు ఒకసారి నెమరు వేసుకున్నాను. నమ్మటానికి మరికొన్ని క్షణాలు పట్టింది.

ఇంకా నాకు ఆశ్చర్యంగానే ఉంది.

"అవును, నిజంగా పంపించాను."

ఆమె కథ రాసింది !

నాకు కలగా ఉంది, కాని కల్లకాదు.

నా ఉత్సాహాన్ని దాచుకోలేకపోయాను :

"కథ పేరేమిటి ?" అని ప్రశ్నించాను.

ఆమె బదులు చెప్పకుండా నవ్వింది. జవాబు కోసం నే నెదురు చూస్తున్నాను.

నాలో ఉత్సాహం, ఆశ్చర్యం మిళితంగా ఉన్నాయి.

ఆమె నెమ్మదిగా అంది : "స్వర్ణలత" అని.

తెల్లబోయాను.... ఆమె కింత ఆలోచన కలిగినందుకు వింతగా ఉంది.

"ఆ కథ నీ కెలా నచ్చింది ?" ఆ కథేమిటో కాస్త గుర్తుకు రాగానే ప్రశ్నించాను.

"పక్కింటాయన చదివి బాగుందన్నారు.... అతనే పోస్టు చేశారు."

* * *

ఒక వారం గడిచింది.

ఆ సాయంత్రం ఇంటికి తిరిగి—వస్తూ మార్కెట్టులో మల్లెలు చూశాను.

తెల్లటి పువ్వులు నాకు ప్రీతి వాటి పరిమళం ఒక ప్రత్యేకత.

తలుపు తీస్తూండగనే పొట్లం కనిపించేలా పట్టుకున్నాను.... గమనించనట్టు ముభావంగా వెళ్లిపోయిందామె.

"పువ్వులు తెచ్చాను." ఆమెకు వినిపించాలని గట్టిగా అన్నాను.

బదులు రాలేదు.

వంటగదిలోకి వెళ్లి మళ్లీ చెప్పాను.

కనీసం నన్నామె చూడనైనా లేదు.

నేను మౌనంగా గదిలోకి వచ్చాను. . కారణం ఊహిస్తున్నాను.

బహుశా, అతని కథ మరొకటి పడేలా ఉంటే, నేను ఇల్లు మారిపోవటం మంచిది. ఆ పరిసరాలు నాకు సరిపడవు.

దుస్తులు మార్చుకుంటూండగా, టేబిలు పైన ఒక ఉత్తరం కనిపించింది. గదిలోకి రాగానే ఎదురుగా కనిపించే పద్ధతిలో ఉంది.

అది పత్రికా సంపాదకులు రాసిన ఉత్తరం.

అనుమానిస్తూ చిరునామా చూశాను. నా పేరున ఉంది.

"సాధ్యమైనంత త్వరలో మీ కథను త్రిప్పి పంపటానికి ప్రయత్నించగలం."

ధన్యుణ్ణి !

తాత్కాలికమైన విశ్రాంతి లభింపజేసినందుకు సంపాదక మహాశయులకు నేను నిజంగా ఋణపడి ఉన్నాను. ★

# మాటర్‌హార్న్‌లోయ..

19 వ పేజీ తరువాయి

వి(శాంతి తీసుకుందేమో చూడాలి. ఆమెను నేను వెతికి తీరాలి" అంది.

"పిచ్చిపిల్లా — ఈ చలిలో ఎక్కడికి వెళ్తావ్ ! ఇదిగో, ఈ రగ్గు కప్పుకో — చలేస్తోంది" అని ఆ ఆసామి—భార్య ఓ దుప్పటి ఇచ్చింది. హెలెన్ నిశ్చయం మారలేదు. "వద్దండీ — నే వెళ్తాను— వెళ్ళి తీరాలి" అనేసి తిరుగు—ప్రయాణం కట్టింది. చలి శరీరాన్ని కొరుక్కు తింటున్నా సరే, ఆమె లక్ష్య పెట్టలేదు. రోడ్డుపక్క ప్రతి పొదలోనూ చూడ సాగింది.

వెతికి వెతికి ఆమె వేసారిపోయింది. గొంతు తడారిపోయింది. కాళ్ళు దిగలాక్కువచ్చాయి. శరీరం పట్టు తప్పింది. టైము అయిదవ్వొచ్చింది. ఆమె తిరిగి ఒక హోటలు చేరింది. చలిమంటలో కర్రలు వేస్తున్న హోటలువాణ్ణి కేకేసి, కాఫీ ఒకటి తెమ్మని చెప్పి, ఓ కుర్చీలో కూర్చుని, టేబుల మీద తల ఆనించి, వెక్కివెక్కి ఏడవసాగింది.

తలెత్తి చూసేసరికి ఎనిమిదయింది. ఆందోళనతో ఆమె చుట్టూ రెండు గంటలనుంచీ నిలబడిన వారి ముఖాలు వికసించాయి. హెలెన్ వారికేసి చూసింది. ఇంచుమించుగా అన్నీ తనకి తెలిసిన ముఖాలే— పరిచయమున్నవే— తన అక్కని గురించిన వివరాలేమీ ఇవ్వలేమని చెప్పిన ముఖాలే ! ! వారంతా ఆమెకు ధైర్యం—చెప్పాలనే ఉద్దేశ్యంతో నిలబడ్డారు.

వారిలో ఒక ధైర్యవంతుడు ఆమెకు ధైర్యం చెప్పే ధైర్యంతో ముందుకు వచ్చాడు.

"మరేం భయపడకండి. కొత్త వూరు కదా ! చుట్టుపక్కలనుంచి వూరు చూడడానికి వచ్చే వారిలో చాలామంది ఇలాగే తప్పిపోతారు. టూరిస్టు గైడులు (వూరు తెలీనివారికి వూరు, దీని వింతలూ చూపించేవారు) వారిని ఆదుకుని, ఆదరించి ఆహార పానీయాలు ఇచ్చి, వాళ్ళను వాళ్ళచోటుకు భద్రంగా చేరుస్తారు. మీ అక్కకూడా రాత్రంతా ఎక్కడో హాయిగా ఉండే ఉంటుంది" అన్నాడు.

ఆ గుంపులో ఒక చిరిగిన ప్యాంటు, లేటెస్టు ఫ్యాషను బుష్‌షర్టు వేసుకున్న యువకునికి ఉత్సాహం పెట్రేగిపోయింది: "పదండి ! ఇలా నిలబడే కన్నా ఓ డజనుమంది రోడ్డు చుట్టుప్రక్కల గాలిస్తే మంచిది — రెండు కళ్ళకన్నా, ఇరవై నాలుగు కళ్ళు పన్నెండురెట్లు మెరుగు — పదండి" అన్నాడు గంటేసి.

ఆ మాటలు — గత పన్నెండు గంటలనుంచీ తన మనస్సుకు లేని ఆనందాన్ని ఇచ్చాయి— అబ్బ! పన్నెండు గంటలే !! ఎంత దారుణం !!! అనుకుందామె.

ఓ చిన్న గ్రూపు అదే మాట మీద తక్కున బయల్దేరారు. హెలెన్ మనస్సు నిమ్మదించింది. చాలా మంది వూరు తెలియని వాళ్ళలా తన అక్క దారి—తప్పి ఉంటుందని ఆయనెవరో చెప్పిన మాటలు ఆమెకు అమిత సంతృప్తిని ఇచ్చాయి.

ఊరు వాడా గుప్పుమంది. అంతా ఈ విషయంలో శ్రద్ధాసక్తులు చూపించారు. అంతా నాలుగు రోడ్ల మొగలో కలుసుకున్నారు. వెతకడానికి వెళ్ళిన వాళ్ళు తిరిగొచ్చేశారు. కొంతమంది మరి కొంతమందితో ఏవేవో చెప్పారు. "పాపం" అన్నారు సమిష్టిగా హెలెన్‌కేసి చూస్తూ.

హెలెన్ ఆత్రంగా ఆ గుంపుకు ఎదురెళ్ళింది.

"ఎవరో ఓ అమెరికన్ యువతి కాల్‌స్ప్రెటన్ ప్రాంతంలో చనిపోయి పడిఉంది — పోలీసులామెను గంట క్రితం కనుక్కున్నారు" అని ఒకతను నసుగుతూ చెప్పాడు.

ఆ మాటలు విన్న తరువాత హెలెన్‌లో చైతన్యం పోయింది. పోలీసులతో కలిసి ఆమె యాంత్రికంగా ఆ స్థలానికి వెళ్ళింది. కాల్‌స్ప్రెటన్ వూరి పొలిమేరకు వచ్చేసరికి — ఒక సాయుధ భటుడు పాల్ జగ్గర్, సైకిలు—తొక్కుకు—వస్తున్న పోలీస్ డిటెక్టివ్ ఇమ్హాఫ్, అతని వెనుక 'బాగా గాయాలు తగిలి చనిపోయిన' ఒక శరీరాన్ని మోస్తున్న నలుగురు మనుష్యులు వారికి కనుపించారు.

"ఎవరి దీ శవం ?" అంది హెలెన్ డిటెక్టివ్ ఇమ్హాఫ్‌ని ఉద్దేశించి.

"ఒక అమెరికన్ యువతి"

"ఆమె పేరు ?"

"నాకంతగా తెలీదు. కానీ, ఆమె చేతి సంచీలో ఉన్న పాస్‌పోర్ట్ మీద మాత్రం — జరీన్ ఐబర్‌షాఫ్ అనుంది" అన్నాడతను.

అంతే ! కొండ అదిరే అంత కేకవేసి, ఆమె పడిపోయింది. కళ్ళు తెరిచి చూసేసరికి ఒక వ్యవసాయదారుని ఇంట్లో మెత్తని పక్కమీద ఉంది. బలవంతంమీద, కనురెప్పలను తెరిచి చుట్టూ చూసేసరికి, ఎదురుగా లోగడ తను చూసిన 'అతను' ఆమె కళ్ళెదురుగా నిలబడి ఉన్నాడు.

"ఎలా ఉంది మీకు ? గాభరా — పడకండి. నా పేరు కార్పొరల్ హెర్మన్ ఇమ్హాఫ్. విస్ప్ భద్రతా పోలీసుశాఖకి నేను చీఫ్‌ని. మీరు కొంచెం కాఫీ తాగితే మంచిదని నా అభిప్రాయం" అంటూ అతను ఆమె సమాధానం కోసం ఎదురు చూడకుండానే, పొగలు — కక్కుతున్న ఓ కాఫీ కప్పు అందించాడు.

ఆమె యాంత్రికంగా కాఫీ తాగింది.

"మిమ్మల్నీ స్థితిలో అసలు పలకరించనే కూడదనుకోండి; కానీ, వీలైనంత త్వరలో మనం అందరం కలిసి మీ అక్కయ్యను చంపిన ఆ దుర్మార్గుణ్ణి పట్టుకోవాలి. దానికి మీ సహాయం కావాలి. కావాలంటే కొన్ని ముఖ్యమైన ప్రశ్నలకు మీరు శ్రమనుకోకుండా సమాధానా లివ్వాలి— ఏమంటారు ?" అంటూ, విధ్యుక్తధర్మ ప్రశ్నలు ప్రారంభించాడు.

హెలెన్ అతనికేసి నిర్లిప్తంగా చూసి, అతనడిగిన ప్రశ్నల కన్నిటికి సమాధానాలు చెప్పింది.

* * *

జరీన్, హెలెన్— ఇద్దరూ మెసాచుసెట్స్‌లో స్మిత్—కాలేజీలో చదువుకున్నారు. ఓహియోలో క్లేవ్‌లాండ్ అనే ఊళ్ళో వారిల్లు ఉంది. వారి తండ్రి కంటి—జబ్బుతో చనిపోయాడు; కూతుళ్ళ రాకకు వెయ్యి కళ్ళతో ఎదురుచూసి. వయసు ఉడిగిన తల్లి ఒకతె ఉంది. ఇద్దరప్పచెల్లెళ్ళూ వేసంగంతా జర్మనీలో సైకిలు తొక్కుతూ గడిపి, ఆగస్టు పదిహేనో తారీకు ప్రాంతాలకు తిరిగి ఇంటికి వెళ్ళడానికి నిర్ణయించుకున్నారు. కానీ, మళ్ళీ ప్రోగ్రాం మార్చుకుని— స్విట్జర్లండ్

# మాటర్ హార్న్ లోయ..

కూడా చూసి, బ్రీమర్ హెలెన్ (పట్టణం) కాబోలు నుంచి సెప్టెంబరు చివరి తారీకుల్లో బయల్దేరి సొంతఊరు చేరేలా నిర్ణయించుకున్నారు.

జర్‌మెట్ చేరేసరికి, హెలెన్—సైకిలు చెడిపోయి, బ్రేకులు పాడైపోవడంవల్ల, ఆమె రైలు మీద విస్ప్ చేరేటట్టూ, జరీన్ మాత్రం తన సైకిలుమీద ప్రకృతి—సౌందర్యం చూస్తూ, విస్ప్ చేరేటట్టు ఏర్పాటు చేసుకున్నారు.

కార్పొరల్ ఇమ్హాఫ్ ఆమెతో మాట్లాడుతున్న సమయంలో— కాన్స్టబుల్ జాగర్ నాకు ఫోనుచేసి, నా సహాయాన్ని అర్థించాడు. చిన్నతనంలో సరదాగా, ఆటలకోసం ఎక్కిదిగిన కొండలు, పుట్టలు ఈనాడు ఒక కర్తవ్యం కోసం గాలించాల్సివచ్చింది. అంతా — చిక్కని హంతకుని కోసం గాలించాము.

నేను కాల్‌పెట్రన్ చేరాక, హత్య జరిగిన ప్రదేశం లాంఛనంగా ఓసారి చూసి, మిస్ ఐబర్‌ష్రాఫ్‌ని కలుసుకున్నాను. అప్పచెల్లెళ్ళిద్దరి ప్రయాణ మొత్తం కాలంలో ఎవ్వరితోనూ విరోధం తెచ్చుకున్నట్టు గాని, వారిమీద ఎవరైనా కక్ష గట్టినట్టు గాని లేదు. హెలెన్ ఐబర్‌ష్రాఫ్ తన మేనమామ పేరు చెప్పి ఎడ్రస్ ఇచ్చింది. అతని పేరు జార్జి డబ్లియు ధవ్వవ్. అతని నివాసం 'వేర్' ( Ware ). జరీన్ అంత్యక్రియలు ఎక్కడ ఎలా జరపాలో తెలుసుకుందుకు నేనతనికి కేబుల్ ఇచ్చాను. హెలెన్ మానసిక స్థితి ఏ మాత్రం సరిగా లేదు. ఆత్రంతో వచ్చే ప్రజలు, వివరాలకోసం వచ్చే విలేఖరులు చాలామంది మందగా ఉంటారు. వాళ్ళ ప్రశ్నలన్నిటికీ హెలెన్ సమాధానం ఇవ్వలేదు. ఆమెను ఈ గొడవలో పడకుండా ఉండేలా ఒక టూరిస్టుహోమ్ (Tourist Home)లో ఉంచి ఒక ముసలామెను కావలా పెట్టాను.

జెనీవాలో ఉన్న యు. యస్. కాన్సులేట్ (U. S. Consulate) మేము అడగకముందే తమ సహాయం మా కోసం సిద్ధం చేసినట్లు తెలియజేశారు. హత్య చెయ్యడానికి— గొర్రెల కాపరినుంచి— ఊరు చూడడానికి వచ్చే మహారాజువరకూ— ఎవరికైనా అవకాశం ఉంది; ఎవరైనా చెయ్యవచ్చు.

టూరిస్టు గైడ్— ఎలాయిస్‌హేర్ అనే అతన్ని కలుసుకున్నాను. రోడ్డుపక్క బండరాయికి వెనుకభాగంలో రాళ్ళమధ్య గోతిలో పడున్న జరీన్ శవాన్ని చూసి, పోలీసులకు రిపోర్టు చేసింది అతనే. సూర్యోదయానికి కొంచెం ముందు అతను కాల్‌పెట్రన్‌కి బయలుదేరి, చెట్లు—చేదారంతో నిండిన దారిగుండా నడుస్తూండగా, ఓ పెద్ద బండరాయి పక్కన విసిరేసినట్టు పడున్న సైకిలొకటి కనబడిందట. ఆ సైకిలు సొంతదారు చుట్టుపక్కల ఉండి ఉంటాడేమో అని కొంచెం పరకాయించి చూసేసరికి ఆ శరీరం కనబడిందట !

హంతకుడు ఆ ప్రదేశంనుంచి పారిపోవడానికి మూడే మార్గాలున్నాయనీ, తూర్పుగా గాని, పడమర వైపుగా గాని, లేక రైలుకట్ట వైపు గాని పారిపోవాలే తప్ప, నాలుగో విధంగా పోవడానికి వీలు లేదని— డిటెక్టివ్ ఇమ్హాఫ్ మా సమావేశంలో చెప్పాడు. 'స్టాల్‌డెన్' వద్ద అంతమైన రోడ్డుకు ఎగువ భాగంలో ఆరు మైళ్ళ దూరంలో ఈ హత్య

జరిగింది గనుక, హంతకుడు ఆ ప్రదేశానికి కారు వంటి వాహనంతో రాడానికి, వచ్చి ఉండడానికీ వీల్లేదని అతనన్నాడు.

గత ఇరవై నాలుగు గంటల్లో 'కాల్‌పెట్రన్' వైపు నుంచి వచ్చిన ప్రయాణీకుల జాబితా తెలపమని, అనుమానించ దగిన స్థితిలో ఎవరు కనుపించినా, వెంటనే పట్టుకోవలసిందని— జర్మనీ, ఇటలీ, ఫ్రాన్స్ దేశాల పోలీసు అధికారులకు తెలియజేశాము.

హత్యా సమయం తరువాత— ఆ ఊరి నుంచి వెళ్ళిన ప్రయాణీకుల జాబితాను పరీక్షించా లని ఇద్దరు పోలీసు ఉద్యోగులను స్టేషనుకు పంపాము. ఆ ఊరికి వచ్చేవి— రెండే రెండు రైలు మార్గాలవడంవల్ల— అట్టే కష్టముండ దనిపించింది.

జరీన్ చాలా దారుణంగా హత్య చెయ్యబడిందని, శవం ఆ ప్రదేశంలో కనబడిన రీతి వర్ణించి ఇమ్హాఫ్ చెప్పాడు.

"— ఈ ఫోటోలో ఉన్నట్టుగానే ఆమె వెల్లకిలా పడుంది. నేను చూసేసరికి ఆమె చనిపోయి, సుమారు పన్నెండు గంటలయ్యుంటుంది. ఏడు ఎనిమిది గంటల మధ్య ఆమె హత్య చెయ్యబడుంటుందని నిర్ధారణ అయిందికదా !— ఆమె ఎడమ కన్ను చితికిపోయింది. నెత్తి పగిలి, కారిన నెత్తురుతో ఆమె జుట్టంతా అట్టలు కట్టుకుపోయింది. జాకట్టు, గాగరా (మోకాళ్ళ వరకూ ఉండే— పరికిణీ వంటిది) రక్తంతో తడిసి, ఎండిపోయాయి. ఆమెను హత్యచెయ్యడానికి హంతకుడు ఉపయోగించిన రాయి రక్తంతో తడిసి, ఎండి, తలవెంట్రుకలు కూడా దానికి అతుక్కుని— ఉన్నాయ్. జరీన్ చాలా అందమైన మనిషని ఫోటో చూస్తే, తెలుస్తుంది కానీ, ఆమెను నే చూసిన రూపం మాత్రం చాలా భయంకరంగా ఉంది...." అంటూ చెప్పాడు.

అతను చెప్పినవన్నీ శ్రద్ధగా విన్నాను. అతని సర్వీసులో ఇదే మొదటి హత్య కేసు అయినా, అతను చాలా అనుభవజ్ఞుడిలా, నిశితంగా ప్రతి చిన్న విషయాన్ని ఆకళింపు చేసుకున్నాడు.

జరీన్ యొక్క దుమ్ము — కొట్టుకుపోయిన బూట్లు, గడ్డిపరకలు ఇరుక్కున్న సాక్స్ — నడుం మీదకు బలవంతాన లాగబడివున్న గౌనును గురించి అతను చెప్పాడు.

"హత్య చెయ్యడానికి కారణం ఒక్కటై యుండవచ్చని నా కనుమానంగా ఉంది" అన్నాడతను.

"అదీ నువ్వే చెప్పాలి" అన్నాను నేను అతన్ని ఉత్సాహపరిచే ధోరణిలో.

"హత్య కేవలం డబ్బు కోసం జరిగినట్టు కనబడదు. ఆమె చేతిసంచిలో నూరు ఫ్రాంక్స్, కొన్ని ముఖ్యమైన కాగితాలు, పైగా ,చేతికి ఖరీదైన అమెరికన్ రిస్ట్‌వాచీ కూడా ఉన్నాయి— అవేమీ తస్కరించబడలేదు" అంటూ ఆగాడు.

చాలా సేపు చర్చించుకున్నాక, మళ్ళీ తిరిగి ఆ హత్యా—ప్రదేశము, పరిసర ప్రాంతాలు చూడ నిశ్చయించుకున్నాము. మేము 'టౌన్‌హాల్' వద్దకు వెళ్ళేసరికి అక్కడ చాలామంది జనం గుంపుగా చేరి, నోటీసొకటి చదువుతున్నారు.

"హంతకుని కనుక్కోడానికి — ఆ వివరాలు తెలిసినవారెవరైనా సరే — తమంతటు తామే వచ్చి నిర్భయంగా పోలీసువారికి ఆ వివరాలు వివరంగా వివరించవచ్చు — బుద్ధిపూర్వకంగా గనుక ఎవరైనా, తమకు తెలిసిన విషయాలు దాచేస్తే— స్విస్ పీనల్‌కోడ్ ప్రకారం దండనార్హులు" అని అందులో ఉంది.

* * *

గడ్డి బాగా నలిగి ఉండడంవల్ల — ఆమె శరీరం బరబర ఒకచోట నుంచి, మరో చోటుకి లాక్కురాబడిందని ఊహించాను. కొండల ప్రదేశం వచ్చేవరకూ ఏవేవో పాదాల గుర్తులు అస్పష్టంగా కనుపించాయి. కొంచెం దూరంలో ఒక చిన్న నీటి మడుగు ఒకటి కనబడింది. ఆ చోటు చూడగానే, జరీన్ హత్య చెయ్యబడింది ఆ ప్రదేశంలోనేమోనని నాకో చిన్న అనుమానం కలిగింది. బహుశా నీళ్ళు త్రాగడానికి వచ్చినపుడు హంతకుడు పొంచి, ఆమెను పట్టుకొని ఉండవచ్చనిపించింది. చుట్టుప్రక్కల వివరాలేమీ దొరకలేదు.

మేము తిరిగి కాల్‌పెట్రన్ చేరేసరికి— అనుమానించదగిన స్థితిలో ఎవ్వరినీ చూడలేదని, రైల్వే టిక్కట్—కలక్టరు చెప్పినట్లు తెలిసింది. ఆనాడు రైలులో ఎక్కినవారు బహుకొద్దిమందనీ, పైగా అంతా గొప్పవారేననీ, ఆయన చెప్పాడట! వారిలో హంతకుడెవడూ లేనే లేడట ! ! ఆ మాట వినగానే నాకు నవ్వాగలేదు. లోక ప్రజలమీద ఆయన కున్న విశ్వాసం, హంతకునికి తను టిక్కట్టు అమ్మలేదనీ, ఒకవేళ అమ్మి ఉంటే తప్పకుండా హంతకుణ్ణి రక్కున పట్టుకొని ఉండేవాణ్ణి అనే ఆత్మవిశ్వాసం నాకు ఆశ్చర్యాన్ని కలిగించాయి.

ఇమ్హాఫ్, జస్టేర్మ్ ఐసన్‌హోవర్, నేనూ కలిసి స్టేషనుకు 'భోజనం' చెయ్యడానికి వెళ్ళాము. మాకు ఒక అందమైన, వయస్సులో ఉన్న ఆమె వడ్డించడానికి వచ్చింది.

నే నామె—పేరు తెలుసుకుని, "మిస్ గసేలా! ఈ స్టేషనులో రైలెక్కే వాళ్ళందరూ ఇంచుమించు నీకు తెలిసే ఉంటారుకదా ! నిన్న విస్ప్ వైపు గాని, జర్మాట్ వైపు గాని ఎవరైనా ప్రయాణం చేశారేమో గుర్తుతెచ్చుకుని చెప్పగలవా ?" అన్నాను.

ఆమె నా మాటలకు కొండెక్కినంత సంబరపడి, "ఆహా ! ఆనాడు ఇద్దరు వెళ్ళారు. హెర్ అనే అతనూ, ఫ్రూహోక్‌బన్ అనే అతనూ— అంతే" అంది.

"ఆ టైములో స్టేషనులో కూర్చునున్న వాళ్ళు గాని, ఇక్కడ భోజనం చేసిన వాళ్ళు గాని ఎవరైనా ఉన్నారా ?" అని ప్రశ్నించాను.

ఆమె చకచక ఏడుగురి పేర్లు చెప్పింది. వే నా పేర్లు రాసి, ఐసన్‌హోవర్‌కి ఇచ్చి—"ఈ ఏడుగురినీ పిలిపించి— ప్రశ్నించాలి— నా అంతటవే నడగను. ఈ పల్లెటూరి వాళ్ళు స్విస్‌స్పెటరంత చిక్కని (సంకుచిత) అభిప్రాయాలు గలవారు. కొత్తవారికి పీక—పోయినా ఏవీ చెప్పరు. నీకైతే కొన్ని గాపోతే కొన్నయినా వివరాలు చెప్పవచ్చు. ఈలోగా నేను టీసక్‌కి వెళ్ళి, జరీన్‌తో ఆఖరిసారి మాట్లాడిన — ఆ హోటలతన్ని కలుసుకు వస్తాను" అన్నాను.

* * *

ఈ హత్యాకాండతో మానసికంగా దెబ్బతిన్న హెలెన్ పరిస్థితి ఎలా ఉందో చూడాలనుకున్నాను. వీలైనంత త్వరలో విస్ప్ వచ్చి, పోస్ట్ మార్టమ్

రిపోర్టులు తీసుకోవాలని ఇమ్మాన్‌తోనూ, జాగర్ తోనూ చెప్పాను.

ఈ హత్యలో 'కాలం' (టైమ్) అనే పదం నన్ను కొంచెం కలవర పెట్టింది. జరీన్—ఐబర్ ష్రిక్ 'టీసక్'కు రెండింటికి వచ్చిందని తేలింది. ఏడూ ఎనిమిది గంటల ప్రాంతంలో హత్య చెయ్య బడింది. ఈ అయిదు గంటలూ ఆమె ఏమై పెట్టు ? అనే ప్రశ్నకు సమాధానం దొరకలేదు.

## వాటర్ హార్స్ లోయ..

'ఆ' హోటలు యజమాని జోసఫ్‌లాంగ్ చాలా మంచివాడిలా కనుపించాడు. అతన్ని — తన ఇష్టం వచ్చినట్టు చెప్పనిచ్చాను. జరీన్‌ని ఆపాద మస్తకం వర్ణించాడు. తన హోటలుకి ఆమె వచ్చి పాలు కావాలని అడిగిందని చెప్పాడు. అనక తను ఆమెకు ఏమని చెప్పాడో, దాని కామె ఏమని చెప్పిందో, తిరిగి తను ఏమన్నాడో, ఆమె ఏమందో, మళ్ళీ తను ఏమన్నాడో అన్నీ చెప్పాడు అతను మాట్లాడిన చెత్తలో వెతగ్గా, కావాల్సిన విషయం ఒకటి దొరికింది. ఆమె అతని హోటలుకు వచ్చినపుడు — పెద్ద సంచీ (సరుకులు పెట్టుకునేది) ఒకటీ, వాటర్—బ్యాగ్ ఒకటీ ఉందనీ. ఆ వాటర్—బ్యాగ్ నిండా నీరు నింపు కుందనీ, చెప్పాడు కానీ, హత్య—ప్రదేశంలో వాటర్ బ్యాగ్ కానీ, పెద్దసంచి కాని లేనే లేదు. డబ్బు దస్కం, ఖరీదైన వాచి వదిలేసి, హంతకుడు ఈ రెండూ తస్కరించడంలో ఆంతర్యం ఏమిటి?

హోటలు నుంచి తిన్నగా ఆమె మరే చోటు కైనా పోయిందేమో....

"హోటలునుంచి ఆమె మరేచోటుకైనా వెళ్ళిం దేమో నీకు తెలుసా ?" అన్నాను నేను. "పోనీ ఏ మ్యూజియంలాంటిదైనా ఉందా" అని కూడా అందించాను.

"హుష్! — ఈ మాత్రం కనుక్కోలేనా?" అన్నాడతను ఉత్సాహంగా. అనక ప్రారంభించాడు.

"ఇక్కడికో కిలోమీటరు దూరంలో రైలు కట్టకి పక్కగా ఓ మిల్లు నడుపుతూ ఎమిల్ స్నిడర్ అనే అతనున్నాడు. అతను పేకాట ఆడడా నికి తన స్నేహితులతో ఇక్కడకు వచ్చాడు. మాటల సందర్భంలో— ఓ అందమైన అమెరికన్ యువతి పంచరు పడ్డ సైకిలు పట్టుకొచ్చిందనీ, టైరు చాలా భాగం పాడైపోవడంవల్ల పంచరు బాగుచెయ్యడానికి చాలా టైము పట్టిందనీ, అయినా ఆమె ఏమీ విసుక్కోకుండా ఓపిగ్గా కూర్చుందనీ, తన భార్యవద్దనుంచి ఏవేవో అల్లిక పనులు కూడా నేర్చుకుందనీ, టైరు పంచరు బాగ చేసినందుకు బాగాముట్టజెప్పిందనీ చెప్పాడు—" అని హోటలు యజమాని జోసఫ్ చెప్పాడు.

అక్కడనుంచి తిన్నగా ఆ మిల్లు — యజమాని ఎమిల్‌వద్దకు వెళ్ళి — జోసఫ్ చెప్పినదంతా నిజమేనని తేల్చుకున్నాను. తన ఇంట్లో జరీన్ చాలా సేపు కూర్చున్నట్టూ, ఆ సమయంలో ఆమె వాటర్—బ్యాగ్, పెద్ద సంచీ, సైకిల్ హేండిల్ బార్‌కే ఉన్నట్టూ అతను చెప్పాడు.

పరిశోధనా తరంగాలు ఒడ్డుకు చేరినట్టేనని భావించి, టీసక్‌నుంచి కాలెస్పెట్రన్ చేరి, మిగతా వాళ్ళకీ కథ చెప్పాను. నేను వెళ్ళేసరికి కర్ట్ఐసన్హో వర్ బుంగమూతి పెట్టుకుని కూర్చున్నాడు. నేను కలుసుకోమన్న (హోటల్లో అమ్మాయి చెప్పిన ఏడుపేర్లు) ఏడుగుర్ని కలుసుకున్నా, ఏమీ తేల్లేదని నిరుత్సాహంతో చెప్పాడు. ఆ ఏడుగురిలో ఆరుగురు తమ కే విధమైన వివరాలూ తెలీవనీ, హత్య జరిగిన విషయం నలుగురికీ తెలిసినట్టే తమకీ తెలిసిందనీ చెప్పారు. ఏడోవాడు మరీ కుర్ర— నాగన్న, నిండా ఇరవైఏళ్ళయినా లేనివాడు. పైగా అతని కసలు హత్య జరిగినట్టే తెలియ దట !

జరీన్—మేనమామదగ్గర నుంచి వచ్చిన కేబుల్ ప్రకారం— ఆమె శరీరాన్ని దహనం చేసి, బూడిద అమెరికాకు (వాళ్ళింటికి) పంపే ఏర్పాటు చేస్తున్నా మని జాగర్, ఇమ్మాన్ నాతో చెప్పారు.

డాక్టరు వద్దనుంచి రిపోర్టు వచ్చింది. జరీన్‌కి తగిలిన మూడు దెబ్బలూ ప్రమాదవశాత్తూ తగిలినవి కావనీ, ఆ దెబ్బలవల్లే ఆమె చనిపోయిం దనీ, చనిపోయేలోగా ఆ దెబ్బలు— రక్తం విప

రీతంగా పోవడంవల్ల— ఆమెకు చెప్పలేనంత బాధ కలిగించి ఉండాలని, ఆమె చనిపోయేలోగా బాధను భరించలేక, గిలగిల తన్నుకుని— మరణయాతన పడుంటుందనీ, హత్య సుమారు ఏడు ఎనిమిది గంటల మధ్య జరిగి ఉండాలని తేలింది.

“ఆమెను హంతకుడు బలాత్కరించినట్టు గాని, లేక.... ఏమైనా మీకు పరీక్షవల్ల తేలిందా?” అన్నారు.

ఆయన తల అడ్డంగా వూపుతూ, “లేదు— అలాటిదేమీ జరగలేదని నిస్సందేహంగా చెప్పగలను. కానీ, హంతకుడు ఆమెను పొందాలనే ఉద్దేశ్యంతో బలాత్కరించి ఉండవచ్చు. ఆమె శరీరంమీద గోళ్ళతో గీరబడిన గీరలున్నాయి” అన్నాడు.

భోజనం చేస్తుండగా టేబిల్‌లో నే సేకరించిన విషయాలు వివరంగా చెప్పాను. మా భోజన కాలంలో అనాహూతులు అతి ఉత్సాహంతో వొచ్చుకొచ్చేశారు. 'టోస్ట్‌వ్ దినపత్రిక' విలేఖరి ఒకతను వచ్చి — ఈ హత్య పేపర్లో మొట్ట మొదటి పేజీలో వెయ్యదల్చుకున్నట్లు, అందుకని చాలా వివరాలు అతి వివరంగా కావల్సినట్టూ చెప్పి తొందరచేశాడు. వాళ్ళకు గాని, బెరిన్ నుంచి వచ్చిన ఫోనుకు గాని నేనేమీ 'వివరాలు' ఇవ్వలేదు. వివరాలు తెలుసుకుని— హత్యపట్ల తమ విచారం ప్రకటించాలన్న ఉత్సాహంతో వచ్చిన వూళ్ళోని చిన్న సజ్జు పిల్లలందరు— వివరాలివ్వనందువల్ల తెగ విచారించారు. జర్మెట్ అధికారులు హంతకుణ్ణి ఆనవాలు కట్టినట్టు కాల్‌పెట్రన్‌నుంచి నాకు కబురొచ్చింది. కాఫీ కూడా తాగకుండా, మేము స్టేషన్నుంచి— (పోలీస్) స్టేషనుకి బయల్దేరాము. హంతకుణ్ణి (లేక అనుమానితుణ్ణి) పట్టుకున్నాం అని ఫోను చేసిన జర్మెట్ పోలీసుశాఖకి నేను తిరిగి ఫోన్‌చేశాను.

అనుమానితుని పేరు 'కారల్‌రాచర్'. అతను మాజీ నేరస్తుడట కూడాను. హత్య జరిగిన నాటి రాత్రి జర్మెట్‌నుంచి విస్పకి రైలులో ప్రయాణం చేశాడట ! కాల్‌పెట్రన్‌లో పరిశోధన కొనసాగించమని జాగర్, ఇమ్హాఫ్, ఐసన్‌హోవర్‌లకు చెప్పి, నేను జర్మెట్‌కి బయలుదేరాను.

నా ప్రయాణం ఓ మాదిరిగా ఫలిత శూన్యం అయింది. రాచర్, కాల్‌పెట్రన్‌నుంచి విస్ప వెళ్ళేవరకూ తన కంపార్ట్‌మెంట్‌లోనే ఉన్నాడనీ, ఒక్కక్షణం కూడా కదల్లేదనీ, హత్య జరిగిన వూళ్ళో రైలు ఆగినా అతను దిగలేదనీ, ఆ కంపార్ట్మెంటు కండక్టరు, తదితర ప్రయాణీకులు సాక్ష్యం ఇచ్చారు. నేను భుజా లెగరేశాను. మళ్ళీ తిరిగి కాల్‌పెట్రన్ వెళ్ళాలంటే, ఆరు గంటలవరకూ ఏ రైలూ లేదు. ఈ ఆరు గంటల కాలం ఏం చెయ్యాలా అని ఆలోచించాను.

ఆ వూళ్ళోనే ఉన్న ఫ్రాన్జ్‌స్కూహో పేరు గుర్తు రావడంతోనే నా మనస్సు కుదుట— బడింది. అతను సైకిలుషాపు ఓనర్రైనా, నాకు ప్రాణస్నేహితుడు. ఓ మాదిరి డిటెక్టివ్ అనికూడా చెప్పవచ్చు. చాలాకేసుల్లో అతను నాకు సహాయం చేశాడు. (సశేషం)

---

అంశాలకు స్పష్టమైన సమాధానాలను చెప్పుకుంటేనేగానీ మన నాయకత్వంలోని లోపాలు వైదొలిగే అవకాశం కనిపించదు.

“మనిషిని మనిషి దోచుకునే విధానం పెట్టుబడిదారీ విధానంలో ఉంటుంది” అనే కారణాన మార్క్సిజాన్ని ఏదో ఒక రూపంలో అమలు జరిపినంతకాలమూ మహాత్మ గాంధి మా నాయకుడు అని ఎన్నిసార్లు చెప్పుకున్నా దురాక్రమణ ప్రమాదమును శాశ్వతంగా నివారించడం సాధ్యంకాదు.

మనిషి ఆలోచనలకూ, సంస్కారానికీ—ఒకటేమిటి, అన్నింటికీ ఉత్పత్తి సాధనాలూ, “ఆర్థికతా” కారణములని మార్క్సిజమ్ అంటున్నద్ది. ఇందుకు 'డాస్ కాపిటల్' మూడు సంపుటాలూ చదవ నవసరంలేదు. ఆ గ్రంథానికి అంత ప్రాముఖ్యం రావడానికి (“సర్‌ప్లస్ వాల్యూ”) అదనపు విలువ సిద్ధాంతమును అందు ఎక్కువగా ప్రస్తావించడమే కారణమని తెలుసుకుని ఈ సిద్ధాంతములోని మంచి చెడులను నిగ్గు తేల్చుకుంటే చాలు. ఎందుకనంటే మార్క్సిజమ్ పేదల తాత్విక సిద్ధాంతమని భావించడానికి ప్రధాన కారణం ఈ సిద్ధాంతము. వర్గ కలహములే చరిత్ర అని చెప్పడానికి ప్రాతిపదిక అదనపు విలువ సిద్ధాంతము. అదనపు విలువ సిద్ధాంతంమీద మోజు కారణంగానే “పెట్టుబడిదారీ” విధానాన్ని నిరసించడం కూడా జరుగుతున్నది. ఇట్లా నిరసించే వారిని “ఈ యుగంలో పెట్టుబడిదారీ విధానమంటే ఏమిటి ?” అని అడిగితే పాత పాటలనే ఒప్పచెపుతారు. మళ్ళీ ఈ అదనపు విలువ సంగతే వస్తుంది. కనుక సర్‌ప్లస్ వాల్యూ నిజంగా అంత అభివృద్ధి నిరోధకరమైనదా ? “సోషలిస్టు” సమాజ వ్యవస్థలో ఇది అసలు ఉండనే ఉండదా అనేవి కూడా పరిశీలనాంశము అవుతున్నవి.

“సర్‌ప్లస్ వాల్యూ” అంటే ? :

కాపిటల్ గ్రంథంలోని ఈ కింది వాక్యాలతో అదనపు విలువ అంటే ఏమిటో పాశ్చాత్య తత్వవేత్త ఒకరు ఇట్లా వివరించారు : “ఒక వస్తువును తయారుచేయడానికి పట్టే శ్రమకు పేరు ధర—ఖరీదు. ఒక వస్తువును అమ్మగా వచ్చిన డబ్బంతా ఆ వస్తువును తయారుచేసిన శ్రామి

# చరిత్ర ధోరణి

1[illegible]-వ పేజీ తరువాయి

కునికి లభించడంలేదు. శ్రమ ఫలితంలో కొంత మాత్రమే లభించుతున్నది. ఆ మిగతా డబ్బును యజమాని తీసుకుంటున్నాడు. ఇదే అదనపు విలువ. వస్తువు ధరకూ, శ్రామికునికి లభించే డబ్బుకూ సంబంధం ఉండడంలేదు. “అంటే సంపద ఉత్పత్తికి శ్రమ ఒక్కటి మాత్రమే దోహద పడుతుందని మార్క్స్ అంచనా.”

ఈ సూత్రమును అంగీకరించేవారు “శ్రమలో కొంత ఎప్పుడూ అదనపు విలువ రూపంలో యజమాని తీసుకొంటాడు. కనుక శ్రామికునికి లభించే వేతనం కేవలం పొట్టపోసుకొవడానికి మాత్రమే సరిపోతుంది. అంతకంటే ఎక్కువ డబ్బు కార్మికునికి ఎన్నడూ లభించదు” అని కూడా అంగీకరించవలసి ఉంటుంది.

ఈ వాదన ఇంకో యిట్లా పోతుంది—తను బతకడానికి కావలసినదానికంటె ఎక్కువే ఉత్పత్తి చేస్తాడు శ్రామికుడు. లేకపోతే అతనికి ఎవరూ పని ఇవ్వరు. శ్రామికుడు బతకడానికి సరిపోయే ఉత్పత్తి పోగా మిగిలేదానిని యజమాని సంగ్రహిస్తాడు. ఈ సిద్ధాంతమును కార్యహాంట్ ఇట్లా విశదం చేశాడు.

“ఒక మనిషి మొత్తం పది గంటలు పని చేస్తాడనుకోండి. అందులో మొదటి అయిదు గంటలలో శ్రామికుడు తను బతకడానికి అవసరమైన వేతనానికి సరిపోయేదానిని తయారు చేస్తాడు. వేతనంగా అది మాత్రమే లభించుతుంది శ్రామికునికి. దీనినే (సోషలీ నెసెసరీ లేబర్) సాంఘికంగా అవసరమైన శ్రమ అంటాడు మార్క్స్. రెండో అయిదు గంటలలో ఉత్పత్తి చేసేదాని నుంచి ఏమీ లభించదు. శ్రామికునికి.— యజమాని దోచుకుంటాడు. సాంఘికంగా అవసరమైన పనిలో ఉత్పత్తి చేసేదానికీ అంతకుమించి చేసే ఉత్పత్తికీ గల తేడాను “సర్‌ప్లస్ వాల్యూ” —అదనపు విలువ అంటాడు మార్క్స్. శ్రామికుని ఎంత దోచుకున్నదీ దీనితోనే కొలవాలి.”

అంటే ఒక వస్తువు ధర నిర్ణయంలో గిరాకీకి గానీ, దానిని తయారుచేయడానికి వినియోగించిన పెట్టుబడి యంత్రాల వంటి వాటికి గానీ మార్క్స్ దృష్టిలో ప్రాముఖ్యం లేదు. ఇక్కడ మార్క్స్ కొంచెం అయోమయంలో పడ్డాడు. అది వేరే సంగతి.

ఇక ఈ అదనపు విలువ మంచి చెడుల సంగతి — ఈ అదనపు విలువ ఒక్క పెట్టుబడిదారీ విధానంలో మాత్రమే ఉంటుందనడం మొదటి పొరపాటు.

సమాజాభ్యున్నతికి, విశేషించి ఉత్పత్తి సాధనాలు ఇంకా యింకా మెరుగుపడడానికి, ఉత్పత్తి చేసేదానిలో కొంత నిలువ చేయడం అవసరము. చరిత్ర ప్రారంభంనుంచీ నేటివరకూ సమాజం ఉత్పత్తిచేసే సంపదనంతా వినియోగించుకొని— చేతులు దులుపుకున్న సందర్భాలు ఏ సమాజంలోనూ కనుపించవు. ఒకవేళ ఏ సమాజంలోనైనా ఆవిధంగా జరిగితే ఆ సమాజం వాడిపోయి ఉంటుంది.

సమాజపరంగా జరిగే అదనపు ఉత్పత్తి అవసరమును గానీ, ప్రయోజనాన్ని కానీ మార్క్స్ కూడా కాదనలేదు. ఆర్థిక సూత్రాల ప్రాతిపదికపై పరిశీలించితే అదనపు టుత్పత్తిని రద్దు చెయ్యాలనడం ఆత్మహత్యా సదృశమని స్పష్టమవుతుంది. అదనంగా ఉత్పత్తి చేయడాన్ని ఆపివేస్తే అదనపు విలువ అంతరించుతుంది. అభ్యున్నతికి కీలకమైన అదనపు టుత్పత్తి ఆగిపోవడంతో సమాజ వ్యవస్థ విభిన్నం అవుతుంది. ప్రాచీన కాలంలోని అనేక సమాజాలు ఈవిధంగానే అంతరించినవి. అదనపు విలువకు మరి ఇంత ప్రాముఖ్యం ఉంటే పెట్టుబడిదారీ విధానంలో అది దోపిడీ ఎట్లా అయినదీ ? అదనపు విలువను ఒక వర్గం కాజేస్తున్నది కనుక పెట్టుబడిదారీ విధానంలో అదనపు టుత్పత్తి దోపిడీ అయినదని మార్క్స్ సమాధానము. ఒక వర్గం ఇట్లా అదనపు టుత్పత్తిని కాజేసే పద్ధతి పోవాలని ప్రబోధించాడు మార్క్స్. దోచుకునేవారిని దోచుకుంటే మనిషిని మనిషి దోచుకునే పద్ధతి అంతరించుతుందన్నాడు.

నిజమే. సంఘంలో ఉత్పత్తి అయ్యే సంపదను

# చరిత్ర ధోరణి

ఒకే ఒక వర్గం హస్తగతం చేసుకునే పద్ధతి పోవలసి నదే—ఆర్థిక కారణములవల్ల మాత్రం కాదు. సమాజంలో న్యాయం విలసిల్లాలి కనుక ఈ పద్ధతి పోవాలని కోరగలము.

వాస్తవానికి మార్క్సిజమ్‌ను విరసించే దేశా లలో ఈ దోపిడీ విధానం ఈనాడు క్రమక్రమంగా అంతరించడంలేదా ? శ్రామికుల శ్రేయస్సుకు ఉత్పత్తిలో కొంత వినియోగం కావడంలేదా ? కేవలం బతకడానికి సరిపోయేటంత మాత్రమే సంపాదించేట్టయితే అనేకమంది శ్రామికులు కాల క్రమేణ యజమానులు ఎట్లా అయినారూ ? ఇట్టి సందర్భాలు చరిత్రలో కావలసినన్ని ఉన్నయ్...

సోవియెట్ రష్యాలో సాంఘికంగా అవసరమైన దానికంటే ఎక్కువ సంపద ఈనాడు ఉత్పత్తి కావడంలేదనగలమా ? .... అదనపు విలువ కార ణంగా మార్క్సిజమ్ అంటే మోజు పడవలసిన అవసరం కనిపించదు.

ఇతర కారణాలు లేవా ?

రాజ్యాంగం—పోనీ ప్రభుత్వం అంతరించి పోయే సమాజ వ్యవస్థను రూపొందించుకోవాలనే ఆశతో మార్క్సిజమ్ అంటే ఉబలాట పడ వలెనా ? మార్క్సిస్ట్ సిద్ధాంతాల ప్రకారం పని చేస్తున్నా మంటున్న సోవియెట్ రష్యాలో ప్రభు త్వం వాడిపోయే లక్షణా లేమైనా కనిపించు తున్నవా ?

కమ్యూనిస్టు సమాజ వ్యవస్థను రూపొం దించే ఆశయంతో ఏర్పడిన దంటున్న నియం తృత్వ పద్ధతి ఇంకా ఇంకా బలపడడంలేదా ?

శరీరశాస్త్రం, మనస్తత్వ శాస్త్రం, భౌతిక శాస్త్రం, రసాయన శాస్త్రం, జీవరసాయన శాస్త్రం, ఇంకా అనేక శాస్త్రములు అభివృద్ధి చెందిన ఈ రోజులలో మార్క్సిజమ్ నిలు స్తుందా ? మార్క్సిస్ట్ దృక్పథం సంగతి కాదు. పరిశీలించవలసినది. మార్క్సిస్ట్ విధానాల సంగతి. సమాజ సంస్కరణకు మార్క్స్ చెప్పిన పద్ధ తులు ఎంత ఉపయోగపడుతయ్ ?

సాంఘికశాస్త్రానికి ప్రాతిపదికను రూపొం దించడంతో మార్క్స్ చేసిన కృషిని నిర్లక్ష్యం చేయ నవసరంలేదు. వాస్తవానికి ఆ ప్రాతిపదిక కూడా ఈనాడు పరీక్షకు నిలబడదు.

పెట్టుబడిదారీ విధానం—కాకపోతే మార్క్సిస్ట్ సోషలిస్ట్ విధానమని భావించడం పొరపాటు. దేశ రాజకీయాలలో మార్క్సిజాన్ని ప్రతిఘటించు తున్నామంటూ, దేశరక్షణ వ్యవహారాలలో మార్క్సి జాన్ని వరింతడం రాజకీయ విజ్ఞతకు లక్షణమా?

"పెట్టుబడి" అంటే "వాణిజ్య, పారిశ్రామి కాది సంస్థలలోని డబ్బు యీనాడు అభివృద్ధికర పాత్రను నిర్వహించడంలేదా ? పెట్టుబడిదారు లందరూ "దోచుకునేవారూ". "శ్రామికు లందరూ" దోచుకొనబడేవారూ ననే సిద్ధాంత మును మన నాయకత్వం ఆమోదించుతున్నదా ?

ఇంతకూ, సిద్ధాంతాలలో ఇన్ని లోపాలు ఫాషన్‌లుగా గూడుకట్టుకున్నందువనే దేశరక్షణ విధానంలో ఇన్ని లోపాలు .... ఈ లోపాలను సరి చేసుకోకుండా పటిష్టమైన దేశరక్షణ విధాన మును రూపొందించుకోవడం సాధ్యంకాదు. ★

# అల్లుని అలక...

13— వ పేజీ తరువాయి

పెయ్యి అడుగడుగునా ప్రత్యక్షమవుతుండటమే.

అంతా సక్రమంగానే జరిగిపోయింది గాని, పెళ్లి కొడుకు కోరికే ఇంకా కొరవ ఉండిపోయింది. స్నేహితులు, అప్పచెల్లెళ్ళూ కాకుల్లా పొడవటం మొదలుపెట్టారు పెళ్ళికొడుకు రామారావును.

"వాళ్ళు అన్నమాటలకే తలవంపులుగా ఉంటే, నువ్వు చవటలాగ ఇలా వూరుకోవటం ఏమీ బాగాలేదు. ఫలానావాడి పెళ్ళికి వెళ్ళి, అవమానం పాలయి వచ్చామని మేము ఏ మొహం పెట్టుకుని చెప్పుకోము.' ఇట్లా రామారావు చెవిని ఇల్లు గట్టుకుని పోరారు.

'ఏమయినా సరే, అలక—పానుపుమీద విలువయిన వస్తువేదయినా కోరాల్సిందే !' అని రూలింగు ఇచ్చారు.

సాయంత్రం అయిదు గంటలయింది.

ఆడపెళ్ళివారు ఘనంగా అయిదు వందల రూపాయలు ఖర్చుపెట్టి రకరకాలుగా అలంకరించిన కారు మాట్లాడారు ఊరేగింపుకు; ఫుల్ బ్యాండు పెట్టుకూడా ఏర్పాటు చేశారు.

కాని, పెళ్ళికొడుకు అలిగాడు ! ఆరు గంట లయినా, పెళ్ళికొడుకు పట్టె మంచంమీద బైఠాయింపు సమ్మె చేస్తున్నాడు !

వెంకయ్య పంతులుగారు తలపెట్టినది ఇదే మొదటి శుభకార్యం. జానకి ఆయన ప్రథమ సంతానం. కలిగినంతలో గొప్ప సంబంధం తెచ్చి చెయ్యాలని రెండు సంవత్సరాలపాటు గాలించి ఆఖరికి ఈ సంబంధం స్థిరపరుచుకున్నారు అన్ని విధాలా నచ్చటంచేత.

అల్లుడు డిగ్రీ పుచ్చుకున్నవాడనీ, కొద్దిపాటి ఆస్తి అదీ ఉన్నది, అత్తమామలు ఉన్న కుటుంబం గనుక అమ్మాయి సుఖపడుతుందనడంలో సందేహం లేదనీ వెంకయ్య పంతులుగారు విశ్వయించు కుని ముందుగా నిర్ణయించుకున్న లోపాయికారి కట్నం లో అయిదు వేల రూపాయలు లగ్నాలు పెట్టుకున్నప్పుడే ఇచ్చేశారు. అదిగాక ఆడబడుచుల లాంఛనాలకింద వెయ్యి రూపాయలు, పెళ్ళి కుమారుడికి వెండికంచం — పట్టు బట్ట లకు బదులు సూటు, రిస్టువాచీ వగైరాలు లగ్న మప్పుడు ఇవ్వడానికి ఒప్పుకున్నారు. అనుకున్న ప్రకారం అన్నీ సక్రమంగా జరిపారు.

ఇంత ఖర్చు భరించడానికి ఆయన సంతోషంతో వప్పుకోడానికి కారణం ప్రథమ సంతాన మయిన జానకి — వివాహం ఘనంగా జరిపించాలని సంకల్పించడమే ! అప్పటికే నాలుగు వేలు అప్పు తగిలింది ఆయనకు.

అల్లుడు అలిగాడనగానే వెంకయ్యపంతులు గారు పరిగెత్తుకుంటూ వెళ్ళారు పట్టు ఉత్తరీయం సరిజేసుకుంటూ.

'ఏం నాయనా ! ఏమిటి సంగతి' అని నవ్వు తూనే అడిగారు.

మానౌ—తడిలేక కళ్ళ మీదకు పడుతున్న జుట్టును చేత్తో పైకి నెట్టడానికి వృథా ప్రయత్నం చేస్తూ ముఖం చిట్లించి కోపం నటించాడు రామారావు, చేతికున్న కొత్త రిస్టువాచీకి ఉత్తుత్తి 'కీ' ఇచ్చాడు కాసేపు.

ఏడెటూ చెప్పలేడని గ్రహించిన పక్కనున్న స్నేహితుడు 'వాడు అలిగాడండీ ! అడగటానికి మొహమాటపడుతున్నాడు' అన్నాడు.

'అనుకున్న ప్రకారం అన్నీ ఇచ్చాను గదుటోయ్! ఇంకా ఏమిటి !.... అవతల ఊరేగింపుకు టయిము అయిపోతున్నది' అన్నారు పంతులుగారు బతిమాలు తున్న ధోరణిలో.

ఉదయమే, ఆడబడుచు కట్నంలో తన వాటాకు వచ్చిన రెండువందలూ పుచ్చుకుని పెట్టెలో దాచుకున్న పెళ్ళికొడుకు— అప్పగారు "వేడుకలన్నీ జరిపి తీరాల్సిందే ! అదేమన్నమాటండోయ్ !" ఇవ్వాళ కాకపోతే ఇంకెప్పుడు చెల్లుతయి వాడి ముచ్చటు్ల మాత్రం ! ఈ కాస్త అయిపోతే ఆ తర్వాత మీరేం పెడతారో, వాడేం తీసుకుటాండో మే మేమన్నా చూడొచ్చామా 'అడగొచ్చామా' అన్నది తమ్ముడికి వత్తాసిగా.

భళిభళి అన్నారు ఇంకో ఇద్దరు ఆమె అన్న దానికి.

కుడితిలో పడిన ఎలుకలాగ అయింది వెంకయ్య పంతులుగారి పని. చుట్టూ ఆడవాళ్ళ మెజారిటీయే ఎక్కువగా ఉంది. అప్పటికే ఖర్చులన్నీ కలిసి తలకు మోపెడయినయి. ఇంకా ఇంకా ఒక దాని కొకటి ఇట్లా పెరిగిపోతుంటే ఎట్లాగని ఆలోచిస్తున్న ఆయన చెవులకు 'అడగరా ! మళ్ళీ అవతల ఊరేగింపుకు వేళవుతున్నదని సుందర్రామయ్యగారొచ్చి బెదిరిస్తే మళ్ళీ కష్టం' అన్న మాటలు వినిపించినయి.

'ఏమడగనూ నా మొహం ' అని జుట్టు పైకి నెట్టుకుని 'స్కూటరు' అన్నాడు రామారావు.

వెంకయ్య పంతులుగారు నీళ్ళు గారిపోయారు. రెండువేల అయిదు వందల రూపాయలు ఆయన కళ్ళముందు మెదిలినయి పసిపిల్లవాడు కారు కొనిపెట్టమన్నట్టుగా ఉన్నది అల్లుడు 'స్కూటరు' కొనిపెట్ట మనటం ! అతనేమంత అజ్ఞానా! తెలివి తక్కువ వాడా! అన్నీ తెలిసే అట్లా అడుగుతున్నాడు. ఆయనకు చాలా బాధ కలిగింది. నయంగా వియ్యపు రాలు, వియ్యంకుడు తమ కివేమీ పట్టనట్టు కొంచెం దూరంగా కూచున్నారు వేడుక చూస్తూ.

రాని నవ్వును బలవంతాన తెచ్చిపెట్టుకుని 'చూడు రామారావ్ ! కష్ట సుఖాలు తెలిసినవాడివి; చదువుకున్నవాడివి. అందుచేత దాపరికం లేకుండా చెబుతున్నాను. 'స్కూటరు' అంటే వందా రెండు వందలకూ వచ్చే వస్తువేమీకాదు. అంత పెద్దగా కోరటం బాగాలేదు. ఏదో నాకు తోచింది నేను సంతోషంగా ఇస్తాను తీసుకో !' అని వంద రూపాయల నోటు ఇవ్వబోయారు పంతులుగారు.

కళ్ళమీద పడిన జుట్టులోంచి వందరూపాయల నోటువేపు చూసి తటపటాయించాడు రామారావు, 'టు బీ ఆర్ నాట్ టు బి' అనే ముక్క జ్ఞాపకం వచ్చి.

'బాగుందిరోయ్ వరస— చావుకు పెడితే లంకణాని కన్నట్టు — ఇదేమిటి!' అన్నా డొక మిత్రుడు టూత్‌పేస్టు అడ్వర్టయిజ్ మెంటులాగ పళ్ళన్నీ వెళ్ళబెట్టి. ఇవేమీ వినిపించుకో కుండ, పంతులుగారు అల్లుడిని సమాధాన పరచ డానికి ప్రయత్నిస్తున్నారు.

ఈ విషయం చల్లగా పాకింది పెళ్ళింటికి. తండిరి తల్లిదనంలో విశ్రాంతిగా పడుకుని

# అల్లుని అలక

ఆడవాళ్ళతో సరదాగా మాట్లాడుతున్న సుందర్రామయ్య గుర్రుమన్నాడు. 'వీళ్ళు మనుషులా రాక్షసులా ! అడిగినంత కట్నమిచ్చి, సలక్షణమయిన పిల్లనిచ్చి అన్ని లాంఛనాలతో పెళ్ళి చేస్తే ఇంకా గొంతెమ్మ కోరికలకు అంతెక్కడ !' అని చిందులెయ్యడం మొదలుపెట్టాడు.

నూతన వధువు జానకికి కళ్ళు నీళ్ళ పర్యంతమయింది. ఇంత హృదయంలేని మనుషులు కూడ ఉంటారా లోకంలో, అనుకుంది. తన తండ్రి ఎంత సరదా పడుతున్నాడో, అంత కించ పరుస్తున్నారు పెళ్ళివారు వచ్చిన దగ్గర నుంచీ కోరికలకు కూడ మితముండాలి ! ఇష్టంవచ్చినట్టు 'నాకు రైలు కావాలి, విమానం కావాలి' అంటే, ఎక్కడి మంచి తేగలరు ఎవరు మటుకు ! జానకిని మూగ బాధ ఆవరించింది. ఎంతో మధురమయినదిగా ఊహించుకున్న వివాహం ఇంత జుగుప్సాకరంగా ఉంటుందనుకోని జానకి బాధపడింది.

సుందర్రామయ్య లేచి విడిదికి వెళ్ళబోతుంటే జానకి భయపడింది. 'బాబాయ్ ! ఒక్కమాట' అని పిలిచి గదిలో నుంచి ఇవతలకువచ్చి, సుందర్రామయ్య దూకుడుగా వెళ్ళబోతున్న వాడల్లా వెనక్కు తిరిగి జానకి దగ్గరికి వెళ్ళి ''ఏమమ్మా !'' అన్నాడు. జానకి మొహం చిన్నబోయి ఉన్నది.

'అంతా విన్నాను బాబాయి ! ఇటువంటి మనుష్యులనుకోలేదు! ఇప్పుడు నువ్వు వెళ్ళి నోరు చేసుకుంటే, అల్లరి అవటం తప్ప మరేంలేదు' అని కాసేపు తటపటాయించి 'ఇదిగో బాబాయ్ ఎవరికీ తెలీకుండ ఈ కాగితం వారికి అందజేయి. ఇదే నిన్ను కోరేది' అన్నది జానకి కాగితం మడత ఆయన చేతుల్లో పెడుతూ.

సుందర్రామయ్య ఆ కాగితం అందుకున్నాడు, ఆయనలో రేగిన కోపం చల్లారింది. ముఖం ప్రశాంతమయింది.' 'అలాగే తల్లీ !' అని జానకి-తల నిమిరి విడిదివేపు దారితీశాడు.

ఈయన్ని చూస్తూనే అలక పాన్పున లంకరించిన పెళ్ళికొడుకు—చుట్టూ చేరిన సగంమంది జారుకున్నారు మెల్లిగా ఇవ్వేమీ పట్టించుకోకుండా, 'ఏమిటి' మామా— అల్లుడు మంతనాలాడుతున్నారు తీరిగ్గా' అన్నాడు సుందర్రామయ్య అతి ప్రశాంతంగా— నవ్వుతూ.

'అబ్బే ఏముంది !.... అల్లుడు ఏదో వేడుక కొద్దీ కోరాడు. ఆ విషయంమీదే మాట్లాడుతున్నాం !' అన్నారు వెంకయ్య పంతులుగారు నుదిటి మీద పట్టిన చెమట తుడుచుకుంటూ. అప్పటికే ఆయన సహనం చచ్చిపోయింది.

సుందర్రామయ్య నవ్వుతూ పెళ్ళికొడుకు పక్కగా మంచంమీద కూచున్నాడు. లోపల పీచుపీచుమంటున్నా, పయికి బింకంగానే కూచున్నాడు రామారావు.

మంచంచుట్టూ జేరిన అందరి మొహాలూ సావధానంగా చూసి, సుందర్రామయ్య పెళ్ళికొడుకు చెవులో రెండు మాటలు రహస్యంగా చెప్పి, కాగితం మడత అతని చేతుల్లో ఉంచాడు.

పెళ్ళికొడుకు రెండు క్షణాలు చలనం లేకుండ అట్లాగే కూర్చుని మంచంమీద నుంచి దిగి 'ఇప్పుడే వస్తానురా' అని మిత్రులకు సంజ్ఞచేసి, బాత్ రూమ్‌లోకి వెళ్ళి కాగితం మడత విప్పి చదువుకున్నాడు. ఆ వెంటనే 'ఛీ ఛీ' ! అనుకున్నాడు పశ్చాత్తాప పడ్డాడు. చేదుమందు మింగినవాడిలా మొహంపెట్టి, ఆ కాగితం అతి భద్రంగా దాచుకున్నాడు.' ఎంత తప్పుపని చేశాను' అనుకున్నాడు.

సబ్బుతో కసాబిసా మొహమంతా రుద్దుకున్నాడు. గదిలోకి వెళ్ళి రెండు నిముషాల్లో డ్రస్ చేసుకుని వూరేగింపుకు సిద్ధమయి బయటికి వచ్చిన పెళ్ళికొడుకుని చూసి సుందర్రామయ్య మినహా అందరూ ఆశ్చర్యపోయారు.

'అప్పుడే అలక తీరిందా ఏమిట్రా' అన్నారు మిత్రులు.

'ఆ ! తీరినట్టే !' అన్నాడు ముక్తసరిగా, అలంకరించిఉన్న కారువేపు నడుస్తూ.

వెంకయ్యపంతులుగారు అయోమయంగా తోడల్లుని వేపు చూశారు. 'అదంతా ఉందిలేండి అన్నగారూ' అని నిండుగా నవ్వాడు సుందర్రామయ్య.

అప్పుడే విడుదలయిన కొత్త సినిమాలో పాట అందుకున్నారు బ్యాండువాళ్ళు.

ఊరేగింపు—కారు బయలుదేరుతున్నదన్నారు అందరూ సంబర—పడిపోయి. పెళ్ళికూతురు సిగ్గు దొంతరలతో హంసలా నడిచివచ్చి కారులో కూర్చుంది తన హృదయేశ్వరుని పక్కన— హృదయమంతా మల్లెపందిరి కాగా.

పెళ్ళికొడుకులో హఠాత్తుగా ఇంత మార్పు రావటానికి కారణం ఏమిటో ఎంత తల బ్రద్దలు కొట్టుకున్నా, అర్థం కాలేదు ఎవరికీ. ★












# రాజధాని కబుర్లు

(10—వ పేజీ తరువాయి)

అల్లకల్లోలం అయిన తర్వాత పెద్ద పెట్టున గగ్గోలు పుట్టిన తర్వాత కొన్ని చర్యలు తీసుకున్నారు. హైదరాబాదులో రెండుచోట్ల, సికింద్రాబాదులో ఒకచోట గిడ్డంగులు ఏర్పాటుచేసి అక్కడి నుంచి చిల్లర వర్తకులకు సరఫరా అయ్యేటట్లు చూస్తున్నారు. విశాల హైదరాబాదులో మొత్తం సుమారు 1500 మంది చిల్లర వర్తకులుంటే వారందరికీ పంచదార అందించటం కష్టమని మొదట అన్నా, చివ్వరకు అందరికీ కూడా అందించగలమని హామీ యిచ్చారు. నెలకు 12 వేల బస్తాలు చొప్పున ప్రథమంగా అందించగలమని, క్రమక్రమంగా యీ సప్లయిని పెంచగలమని అన్నారు. స్థానిక దినపత్రికల్లో కూడా చిల్లర వర్తకుల పేర్లు, వారి కిచ్చిన కోటా వగైరాలు ప్రకటించారు ఇవన్నీ చేసినా కూడా పరిస్థితి అదుపులోకి వచ్చిందని మాత్రం చెప్పగలమే కాని, పూర్తిగా, సంతృప్తికరంగా ఉందనటానికి మాత్రం యింకా అవకాశం రాలేదు. కంట్రోలు పెడితే, ఆ వస్తువు మార్కెటులో కనబడదని అనుభవంవలన ప్రతివారికీ తెలిసిందే! ఇలాంటి కొరతలు కొత్తేమీ కాదు. మాటికి మాటికి ఏదో వస్తువుకు యిలాంటి దశ పట్టటం పరిపాటే. ప్రభుత్వంవారు అప్రమత్తులై సత్వర తక్షణ చర్యలు తీసుకుంటేగాని, ఏలాంటివాటిని అదుపులో పెట్టటం సాధ్యంకాదు. పంచదార రభస యింకా పూర్తిగా సద్దుమణగక మునుపే యింకో కొరత ఏర్పడింది.

ఈ 'ప్రభావం' పంచదార లాంటిది కాదు. దేనికదే ప్రత్యేకత. పాఠశాలల్లో సీట్ల కొరత, వేసంగి శలవ లయిపోయినాయి. స్కూళ్ళు, కాలేజీలు తెరిచారు. సీట్లకోసం విపరీతమైన 'రష్'. ప్రతివానికీ తాపత్రయమే. మన పిల్లలకు సీట్లు దొరుకుతాయా లేవా అని. పైగా ఈ ఏడాది యీ ఆదుర్దా ఇంకా ఎక్కువగా కూడా ఉంటుంది. ఈ అత్యవసర పరిస్థితుల్లో కొత్తగా స్కూళ్ళు పెట్టే అవకాశం లేదని ప్రభుత్వంవారు ప్రకటించారు కాబట్టి పైగా ఇంగ్లీషుబోధనా భాషగా ఉన్న స్కూళ్ళల్లో ప్రవేశానికి ఈ ఏడాది ఎక్కువ 'డిమాండు' ఏర్పడింది. మూడోక్లాసు నుంచి ఇంగ్లీషు ప్రవేశపెట్టాలని కొంతసేపు. మోడల్ ప్రయిమరీ స్కూళ్ళలో ఒకటవ క్లాసు నుంచే ఈ ఇంగ్లీషు అభ్యసించాలని. ఇంకోమాట, ఏమైనా హిందీ ప్రాముఖ్యం హెచ్చిపోతోంది, దీన్ని లొంగదీసుకుంటే గాని, ఇకముందు ముందు ఉద్యోగాలకు యిబ్బంది అవుతుందని ఒక ఆవేదన. చిన్న క్లాసుల సంగతిట్లా ఉండగా, ఇక మూడేళ్ల డిగ్రీకోర్సును ఉంచటమా, తిరిగి మార్చటమా అనే సమస్య కూడా మన ప్రభుత్వాన్ని పట్టుకు పీడిస్తోంది. అసలు ప్రభుత్వానికే విద్యావిధానంలో యిదమిద్ధమైన పద్ధతి లేనప్పుడు విద్యార్థులు అయోమయావస్థలో ఉండిపోవటంలో ఆశ్చర్య మేమిటి? తల్లిదండ్రులో అవుతే తమ పిల్లలను ఏ క్లాసులో ఏ మీడియమ్‌లు ప్రవేశపెడితే ఉపయోగమో తెల్చుకోలేక తికమక పడిపోతున్నారు. ఈ ఏడాది ఉన్న విధానం ముందు కేడు ఉంటుందనే నమ్మకం లేకపోవటంవలన ఏరీతి మంచిదో నిర్ణయం చేసుకోలేక పోతున్నారు. చదువులు మాన్పించి ఇళ్లల్లో కూర్చోపెట్టుకుంటే

**వదంతులను వినకండి**

**వదంతులను ప్రచారం చేయకండి**

---

**మంచిదా అనే విరక్తిలో పడిపోతున్నారు. విశాల** హైదరాబాదులో ప్రయివేటు ప్రయిమరీ స్కూళ్ళు, యీ మధ్యకాలంలో చాలా వెలిసినాయి. గవర్నమెంటు స్కూళ్లల్లో సీట్లు దొరక్క, ఇంగ్లీషు మీడియమ్ మోజులో పడిపోయి ఈ ప్రయివేటు స్కూళ్లల్లోనే చాలామంది తమ పిల్లలను ప్రవేశపెడుతున్నారు. అయితే ఇక్కడ ఉత్తీర్ణు **లయిన విద్యార్థులను, గవర్నమెంటు స్కూళ్లల్లో మళ్లీ పరీక్ష పెట్టందే చేర్చుకోరు. ఈ స్కూళ్లలో చదివినవారు కనుక, వీరికి ముందుగా** ప్రవేశం **ఇవ్వాలని,** నియమమూలేదు. ఇదీగాక, ఇలాంటి ప్రయివేటు స్కూళ్లవలన కొంతలాభం ఉంది నష్టం అంతకంటే ఉంది. శ్రద్ధగా చెప్పటానికి అవకాశం ఉన్నట్లే, వాళ్లమీద ప్రత్యక్షంగా అజమాయిషీలేకపోయేటప్పటికి, ప్రయివేటు మానేజిమెంటువారు, టీచర్ల విషయంలో శ్రద్ధ వహించక, తక్కువ జీతాలు పుచ్చుకునేవాళ్ల కోసం వెతుక్కోవటంతోనే, యేడాది గడిపేస్తూ **ఉంటారు.** పిల్లలకు చదువుసున్నా, ఏడాది పూర్తి **అయ్యేటప్పటికి** ఫీజు వరుసగా వసూలు చెయ్యటం అయిపోయింది. ప్యాసయినట్టు సర్టిఫికేటు **కూడా** ఇచ్చి, అమ్మాయిగాని, అబ్బాయిగాని, స్టాండర్డ్‌సరిగ్గా లేదండీ, ప్రయివేటు చెప్పిస్తే, ఈ ఏడాది ఫరవాలేదు అని సలహా చెపుతూ ఉంటారు. ఈవిధంగా, హైదరాబాదులో ప్రయివేటు మానేజిమెంటు క్రిందనడపబడ్డ ప్రయిమరీ స్కూళ్ల స్థితిగతులు, రచ్చకెక్కటం కూడా జరిగింది. ఇంగ్లీషు మీడియమ్ స్కూళ్లకు యెక్కువ 'డిమాండ్' చూసి, ప్రభుత్వంవారు, నాంపల్లి, ఖాదర్‌ఘాట్, గోషామహల్‌లో ఉన్న స్కూళ్లల్లో ఈ ఏడాది నుంచి, ఇంగ్లీషు బోధనా భాషగా ప్రవేశ పెట్టటం కూడా జరిగింది. విద్యాశాఖాధికారులు, స్కూళ్లకు వెళ్లి 'అడ్మిషన్' పరిస్థితి స్వయంగా తెలుసుకుంటూ, తల్లి తండ్రులకు, విద్యార్థులకు ఉపయోగకరంగా ఉంటున్న **మాటవుతే నిజమే!** వారు మాత్రం యేం చేస్తారు.· **కాస్త** వూరడింపు మాటలవుతే చెప్పకలుగుతారు! **అంతేగా!** లేనిసీట్లు తెచ్చిపెట్టి ఇవ్వలేరుగదా **ఇవన్నీ** ఇట్లా ఉండగా నిర్బంధ ప్రాథమిక విద్యను అమలు పరచడానికి, కేంద్ర ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వానికి అదనపు సహాయాన్నివ్వటానికి నిశ్చయించిందిట! దీనికి యెంతడబ్బు అవుతుందో, లెక్కలు తేల్చమని, వాటిని ఈ జూన్ నెలాఖరు లోగా పంపమని కోరిందట. వీళ్లు లెక్కలు పంపేదెప్పుడు, ఆ పథకం అమలు జరిగేదెప్పుడు, ఇక్కడ బీగమ్‌పేటలో జరిగిన మూడవ నిర్బంధ ప్రాథమిక విద్యా విధానానికి సంబంధించిన సెమినార్‌లో, దేశం మొత్తంమీద నుంచి 50 మంది దాకా ప్రతినిధులు పాల్గొన్నారు. కూలంకషంగా **అన్ని** విషయాలు చర్చించిన తర్వాత, ప్రాథమిక విద్యాబోధనను, ప్రయివేటు మానేజిమెంట్సుకు **అప్పగిస్తే** బాగుంటుందని అభిప్రాయం వెలబుచ్చారు. **ఇంతకీ తల్లిదండ్రులకు, విద్యార్థులకు,**

# రాజధాని కబుర్లు

చిన్న క్లాసుల అడ్మిషన్ గురించిగాని, పెద్ద క్లాసుల్లో ప్రవేశాన్ని గురించిగాని, ఆదుర్దా, ఆందోళన కారణం, ప్రభుత్వంయొక్క నిర్దుష్టమైన విద్యావిధానం లేకపోవటమే! ఏటేటా సంస్కరణలతోనూ, పరిశోధనలతోనూ విద్యావిధానం **సాగిపోతూ ఉంటే, యెంతమంది విద్యార్థులు, అనవసరంగా, వీటికి 'బలి' అయిపోతూ ఉన్నారో** గమనించాలి. మన దేశఅవసరాలదృష్ట్యా, పరిస్థితులకు **అనుగుణంగా** విద్యావిధానాన్ని, ఇంతవరకు **కూడా** రూపొందించలేకపోవటం విచారకరం, దురదృష్టకరమూ కూడా.

ఐ. ఎల్. ఎన్. ★

# న్యూఢిల్లీ లేఖ

7 వ పేజీ తరువాయి

గంలో ఎక్స్‌టెంషన్ పనికిరాదంటున్నారు ఈ విషయానికి ప్రాముఖ్యత రావటానికి కారణం ఉంది, హాఫిజ్ మహమద్ ఇబ్రహిం తమ కార్యదర్శి యం. ఆర్. సచ్‌దేవకి ఎక్స్‌టెంషన్ ఇవ్వాలన్నారు. కాని, అంతరంగిక మంత్రిశాఖవారు అంగీకరించటంలేదు. సచదేవని గోవా లె. గవర్నర్‌గా నియమిస్తారనుకుంటున్నారు. ఆ స్థానంలో ఉన్న శివ శంకర్‌ని దామోదర్‌లోయ కార్పొరేషన్ అధ్యక్షులు చేస్తారేమో!

ప్లానింగ్ కమిషన్ కార్యదర్శి వ్యవహారం అసంతృప్తికరంగా ఉంది. ఎస్. ఎస్. ఖేరా క్యాబినెట్ సెక్రటరీ మాత్రమే అయినప్పటికీ అసలు కార్యదర్శి శ్రీ త్రిలోక్‌సింగ్ పనిఅంతా తమ బాధ్యత కాదే భావిస్తూ, ప్రవర్తిస్తూ వచ్చారు త్రిలోక్ సింగ్ కమిషన్ మెంబర్ అయిన తర్వాత వారిపని అధికం అయిపోయింది. అంతేకాక రక్షణ మంత్రి శాఖకి కార్యదర్శిగా కూడా పనిచేస్తున్నారు. ప్లానింగ్ ప్రత్యేక కార్యదర్శిగా వచ్చిన శ్రీ ఎ. ఎన్. షా తమ ఉద్యోగాన్ని వదులుకోలేక పోతున్నారు సెలవు మీద వెళ్లి రక్షణ ఉత్పత్తి శాఖలో చేరారు. అందుచేత కమిషన్ ఉపాధ్యక్షులు, సహాయ కార్యదర్శిగా ఉంటున్న ఎస్ ఆర్ సేన్‌ని కార్యదర్శిగా నియమించారు. ఇంతవరకూ ఏ ఉపాధ్యక్షుడూ ఇటువంటి ఉద్యోగంలో ఎవరిని వెయ్యలేదు అసలు ఆయనకి ఈ ఉద్యోగంలో ఎవరినయినా వేసే అధికారం ఉందా అనే ప్రశ్న చర్చనీయం

బ్రిటిష్ పద్ధతి ప్రకారం ఏ మంత్రికీ తన శాఖ కార్యదర్శిని నియమించే అధికారంలేదు. "ఎస్టాబ్లిష్‌మెంట్ బోర్డ్" (Establishment Board) గారికే ఈ అధికారం ఉంది స్వాతంత్ర్యం వచ్చాక ప్రతి మంత్రికీ ఒక 'నామావళి' చూపించి కావలసిన వ్యక్తిని ఎరుకోమనటం అలవాటయిపోయింది అయితే, తను పదవి స్వీకరించినప్పుడు కార్యదర్శిగా ఉంటున్న వ్యక్తిని కదిపే అధికారం మంత్రికి ఉండదు అంటే, తనశాఖ కార్యదర్శి పదవికి తానెవరిని నియమించే అధికారం మంత్రికి ఉండదని అర్థం

వీటన్నిటివల్ల, ప్లానింగ్ కమిషన్ ఉపాధ్యక్షుడు సేన్‌ని నియమించడం అక్రమం అని తెలుసుకోవచ్చు ఏటన్నిటి మాటా అలా ఉంచి, ఈ పదవికి అర్హులయిన ఇతర సీనియర్ ఆఫీసర్ల సంగతేమిటి?

* * *

నూరుమందికి పైగా అబ్బాయిలూ, అమ్మాయిలూ అమెరికాకి వెడుతున్నారనే వార్త ఒకటి వెలువడింది 'అంతర్జాతీయ జీవనం' పరిచయాస్తారుట వీరు మరెవరయినా ఖర్చులు భరిస్తున్నప్పుడు ఇటువంటివి (సాధారణంగా) బాగానే ఉంటాయి కాని ఒక విషయం మరిచిపోరాదు అమెరికా జీవన ప్రమాణాలు ప్రపంచంలో కెల్లా అధికమయినవి ఆ ప్రమాణాలు చవిచూసిన తర్వాత స్వదేశంలో అనుభవాలు హీనంగా కనిపిస్తాయి కదా? దీని పర్యవసానం ఏమిటి ?

ఈ విధంగా భారతీయులని అమెరికన్‌లుగా

మార్చాలని చూసే ప్రయత్నాలు హర్షించ దగినవి కావు

అస్సాంలో మాట్లాడుతూ ప్రధాన మంత్రి భారత చైనా దేశాలమధ్య పోరాటం నిర్విరామంగా కొంత కాలం కొనసాగితే పై రెండు దేశాలకే కాక ప్రపంచ శాంతికి కూడా ప్రమాదకరమని చెప్పారుట. అంటే ప్రధానమంత్రి 'కొలంబో ప్రణాళిక'కు భిన్నంగా ఉండే రాజీ ఏదయినా ఉందేమో పనిచూస్తున్నారా, అని కొందరు అడుగుతున్నారు.

# న్యూఢిల్లీ లేఖ

శ్రీ నెహ్రూ నిర్విరామమయిన యుద్ధం గురించీ, ఆయన సహచరులు అయిదు సంవత్సరాల పాటు ఉండే అత్యవసర పరిస్థితి గురించీ చెబుతూ వచ్చారు 'ప్రపంచ శాంతి'ని గురించి ఇంకా ఎన్ని సంవత్సరాలు ఈ కలలు కనడం ? చైనాకాని, ఇండోనేసియా అధ్యక్షుడుకాని దీనిని గురించి బాధపడినట్లే కనిపించదు.

ప్రధాన మంత్రి వైఖరిలో మార్పురావటానికి కారణం లేకపోలేదు 'కొలంబో రాజ్యాలు' చైనాతో మంతనాలు ప్రారంభించమని వారిని వత్తిడి చేస్తున్నాయి 'ప్రపంచ శాంతికి భంగం' అనే భూతాన్ని లేవతీస్తే కాని ఈ దేశం — ప్రధాన మంత్రి అన్ని వాగ్దానాలు చేసిన తర్వాత— చైనాతో చర్చలకు సమ్మతించదు. ఏది ఏలా ఉన్నా, తన పార్టీ వారిని మార్చాలన్నా కష్టం అనే విషయం ప్రధానమంత్రి తప్పక తెలుసుకుంటారు ★

# మరువలేని మనిషి

రచన: 'ధర్మేంద్ర'

**కీర్తి, సంపద ఉంటాయి కాబట్టి సినిమాతారలు మానవులలో కెల్లా** అదృష్టవంతు లనుకుంటారు ప్రజలు

అంతేకాక, వెండితెరమీద వ్యక్తికీ నిత్య జీవితంలో వ్యక్తికీ చాలా భేదం ఉందనుకుంటారు ప్రజలు

కాని ఈ అభిప్రాయాలు కల మనిషికీ, నిజానికీ ఒక వది తిరాలెంతదూరం ఉంటుందో అంత దూరమూ ఉంటుంది !

మావంటి ఫిలింస్టార్లు సయితం కార్మికులమే కదా— గట్టిగా చెప్పాలంటే చాలా కష్టపడి పనిచేస్తాంకూడా ! మేము మానవాతీతులం కాము మాకూ ఆశలూ, ఇష్టా ఇష్టాలూ, ప్రేమ,



పాఠకులకు నా శుభాకాంక్షలు

ద్వేషం ఉంటాయి కొన్ని సమయాలలో సంతోషంతో ఉప్పొంగిపోతూ ఉంటాము మరికొన్ని సమయాలలో దుఃఖంతో క్రుంగిపోతాము మేమూ మనుష్యులమే కదా ! మనుష్యులం అయిన తర్వాత మాలో చిత్రమయిన వ్యక్తిత్వాలు దాగి ఉంటాయి

సాధారణ మానవునివలెనే, నేనూ పగటికలలు కనేవాడిని ఆశలతో, ఆశయాలతో ! ఆ మనిషిని కలవకముందే అతనంటే ఇష్టం కలిగింది అతన్ని గురించి విన్నానంతే ప్రత్యక్షంగా చూడక పోయినా తెరమీద చూశాను నా మొదటి కుతూహల భావం చివరికి వ్యామోహంగా మారిపోయింది

కళాకారునిగా గౌరవించాను నటునిగా ఈర్ష్య చెందాను.

ఆ రోజుల్లో నాకు ఏ స్టూడియో దగ్గిరలేదు ఎన్ని మైళ్ల దూరమో ! కాని నిర్ణీతకాలం సమీపించడంతో నా ఆశయాలనే గుర్రాలు, నా అదృష్టం కలిసివచ్చి, నన్ను సినిమాలలో చేర్చేయి ప్రారంభంలో చాలా కష్టాలు పడ్డాను అయితేనేం విజయం తథ్యంకదా !

కాని, ఈ చిన్ని విజయాలు ఈ మనిషి మీద నాకు ఉండే అభిప్రాయాలు మారేట్లు చెయ్యలేదు కాకపోగా, అతని నైపుణ్యం గురించి నాకు మరికొంత గౌరవ భావం కలిగింది

చివరికి ఈ వ్యక్తిని ముఖాముఖీ కలిశాను

విజయం ఇతని తల తిరిగేట్లు చేసిందా అనుకున్నాను కాని నా ఊహ నిజంకాదని తెలుసుకుని సంతోషించాను

విజయశిఖరం సాధించినవాడు, కాని అహంభావం లేదు అందుకనే తనంటే నాకంత ఇష్టం

ఇతనికోసం మీ ఫిలిం ఆల్బమ్‌ల బయట వెతక నవసరంలేదు అతను మీ అభిమాన నటుడు రాజేంద్రకుమార్ ! మీరే గనక అతన్ని కలిస్తే నా అభిప్రాయం దృఢ పడటం జరుగుతుంది

రాజేంద్ర మరువలేని మనిషి అతనితో మాట్లాడితే మీ చిరాకులు మాయమవుతాయి మీ బాధలు మరిచిపోతారు అంతేకాదు— అతను మాట్లాడితే ఒక విషయం గురించి రెండవసారి చెప్పడు

ఎవరు చెప్పినదయినా వినటానికి సిద్ధం ! ఏ విషయమయినా నేర్చుకొనటానికి సిద్ధం !

అతన్ని పొగిడేస్తున్నా ననుకుంటున్నారా ? అవును, పొగుడుతున్నాను ! రాజేంద్రకుమార్ వంటి వాడిని గురించి మాట్లాడేటప్పుడు పొగడక ఏం చెయ్యగలం ? అందులోనూ మా ఇద్దరి సంబంధం హృదయానికి సంబంధించినది

ఈమధ్య అతను నటించే సినిమాలో పాత్ర దొరికే అదృష్టం నాకు పట్టింది. ఇది అతని వ్యక్తిత్వంలోని లోతులను అవగాహన చేసుకునే అవకాశం కలిగించింది అతనిమీద నా ప్రేమాభిమానాలు పెరిగాయంటే నమ్మండి

ఇప్పుడు మే మిద్దరం కలిసి పనిచేసేటప్పుడు ఏవేవో మాట్లాడుతూ ఉంటాము అతను నాకు నిత్య సహచరుడనిపిస్తుంది

ఎల్లప్పుడూ చిర నవ్వులొలికే రాజేంద్ర కుమార్ కేవలం నటుడూ, ఉత్తమ మిత్రుడూ కింద మాత్రమే ప్రశంసనీయుడుకాదు విశ్వాస పాత్రుడయిన భర్త, ప్రేమపూరితుడయిన తండ్రి!

ఈ మనిషివల్ల నా కొక నిజం తెలిసింది సినిమా వ్యక్తులుకూడా మనవంటి మనుష్యులేకాని అసాధారణ వ్యక్తులేమీకారు

షూటింగ్ లేనప్పుడు అతని ఇంటికి వెళ్లి చూడండి తన కుటుంబంవారితో పిచ్చాపాటీ మాట్లాడుతూ ఉంటాడు !

ఇవి గౌరవనీయమయిన గుణాలు— రాజేంద్ర కుమార్ మరువలేని మనిషి ఇప్పటికయినా అంగీకరిస్తారా ? ★



'తిరుపతమ్మకథ'లో కృష్ణకుమారి

# అవీ - ఇవీ - అన్నీ

## 'మూగ మనసులు'

బాబూ మూవీస్‌వారి ద్వితీయ చిత్రం "మూగ మనసులు" షూటింగ్ ఈ నెల 10 నుండి 15 వరకు షెడ్యూలు ప్రకారం రెండు సెట్లు పని పూర్తిచేయనున్నారు ఈ షెడ్యూలులో ప్రముఖ నటవర్గం అంతా వస్తారు

ఈ చిత్రం తాలుకు ఔట్‌డోర్ పని పూర్తి అయింది 29 రోజులు షూటింగ్ జరిపి, ఎనిమిది వేల రీళ్లకు పైగా ఔట్‌డోర్ దృశ్యాలే చిత్రీకరించారు

ముక్తేశ్వరం దగ్గర ఈ చిత్రంలో హీరోయిన్ ఇల్లు (పెద్ద బంగళా, బెడ్‌రూమ్, డ్రాయింగ్ రూమ్, బాల్కనీ వగైరాలతో) ఆరుబయట ఒక పెద్ద సెట్ వేసి షూట్ చేశారు

కర్పూరందగ్గర హీరో—ఇల్లు (పూరిగుడిసె)గా సెట్‌వేసి షూట్ చేశారు ఈ చిత్రంలో హీరో—హీరోయిన్‌లుగానాగేశ్వరరావు,సావిత్రినటిస్తున్నారు ఔట్‌డోర్ చిత్రీకరణలో నటీ నటులంతా పాల్గొన్నారు ఔట్‌డర్ దృశ్యాల చిత్రీకరణలో 'ప్యాచ్ వర్కు'లాటిది మిగిలింది ఒకటి రెండు రోజులు మాత్రమే ఉంటుంది, దానితో ఔట్‌డోర్ షూటింగ్ పూర్తి అయినట్లు

ఈ చిత్రం సెప్టెంబరు నెఖారుకు షెడ్యూలు ప్రకారం పూర్తిచేయనున్నారు అక్టోబరులో గాని, జనవరిలో గాని విడుదల చేస్తారు

ఈ చిత్రంలో మొత్తం పాటలు ఎనిమిది ఆరు పాటలను రికార్డు చేశారు రెండు పాటలను రికార్డింగ్ చేయాలి నాలుగు పాటలను చిత్రీకరించారు ఈ నాలుగు పాటలలో ఒకటి జమునా రాణి పాడింది మిగిలినవి ఘంటసాల, సుశీల పాడినవి ఈ పాటలలో ఒకటి మాత్రం దాశరథి వ్రాశాడు మిగిలిన పాటలన్నీ ఆత్రేయ వ్రాశాడు



"అమర జక్కన్న"లో సరోజాదేవి, నాగేశ్వరరావు

## అవీ ఇవీ అన్నీ

దర్శకుడు శ్రీఆదుర్తి సుబ్బారావు, కవిద్వయం ముళ్లపూడి వెంకటరమణ, ఆత్రేయ కలిసి చేసిన సృష్టియే "మూగ మనసులు" కథ

పాటలు ఆత్రేయ, సంగీతం కె వి మహాదేవన్, ఛాయ : పి యల్ రాయ్, కళ జి వి సుబ్బారావు, కూర్పు టి కృష్ణ, స్క్రీన్ ప్లే, దర్శకత్వం ఆదుర్తి సుబ్బారావు, నిర్మాత సి సుందరం

## "గురువును మించిన శిష్యుడు"

విశ్వశాంతి ప్రొడక్షన్సువారి జానపద చిత్రం "గురువును మించిన శిష్యుడు" ఈ నెల 2వ తేదీని శంకుస్థాపనయంగా గోల్డెన్ స్టూడియోలో ఉదయం 9 గంటలకు ప్రారంభించారు

ఆంజనేయుని దేవాలయంలో గంభీరాకృతి గలిగిన వీరహనుమాన్ ప్రతిమ, ప్రతిమ ముందు రకరకాల పువ్వులు, చుట్టూ దీపములు సెట్టులో బాలకృష్ణ, వర్ధమాని విశ్వనాథంతో షూటింగ్ ప్రారంభించారు

ఈ చిత్రంలో కాంతారావు, రాజనాల, కృష్ణకుమారి, రాజశ్రీ మొదలగువారుంటారు

విఠల్ ప్రొడక్షన్సు అధినేత — దర్శకుడు అయిన విఠలాచార్య తన యూనిట్‌తో క్రొత్త పోకడలో, అన్ని రసాలు గలిగిన ఈ చిత్రాన్ని త్వరలో పూర్తిచేసి విడుదల చేస్తారని తెలుస్తుంది

ప్రస్తుతం వీరి దర్శకత్వంలో ఉన్న మరో చిత్రం రాజ్యలక్ష్మి వారి "బందిపోటు"

"గురువును మించిన శిష్యుడు" చిత్ర ప్రారంభోత్సవానికి పాత్రికేయులు, పూర్ణా పిక్చర్సు డిస్ట్రిబ్యూటరు శ్రీ కామరాజుకూడ హాజరయ్యారు

## అంజలీ పిక్చర్సు తెలుగు చిత్రం

అంజలీ పిక్చర్సువారి తెలుగుచిత్రం విజయా స్టూడియోలో ఈ నెల 4వ తేదీనుండి 12వ తేదీవరకు షూటింగ్ జరిగింది అదొక భవంతి ఆ భవంతి యజమాని రేలంగి

ఈ చిత్రంలో యన్ టి రామారావు, హరనాథ్, రేలంగి, రమణారెడ్డి, సి యస్ ఆర్ పద్మనాభం, అంజలీదేవి, గిరిజ, వాసంతి, మొదలగువారు నటిస్తున్నారు మాటలు డి వి నరసరాజు, ఛాయ కమల్‌ఘోష్, కళ కృష్ణారావు, కూర్పు ప్రకాశ్, దర్శకుడు వేదాంతం రాఘవయ్య, నిర్మాత—సంగీతదర్శకుడు ఆదినారాయణరావు

## దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు గృహప్రవేశం

ప్రముఖ తెలుగు— తమిళ చలన చిత్రాల దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు మద్రాసు టి నగర్ లోని సారంగపాణి స్ట్రీట్‌లో ఉన్న 38 నెంబరు ఇంటిని కొనుక్కున్నాడు ఆ ఇంటికి ఉన్న చిన్నచిన్న మరమ్మత్తులు చేయించి ఈ నెలాఖరుకు ఆ ఇంట్లో గృహప్రవేశం చేస్తారు ఇదివరకు ఆ ఇల్లు హీరో నాగేశ్వరరావుది నాగేశ్వరరావు అడయారు—ఇంట్లోకి మారిన తరువాత ఇంతవరకు ఆ ఇంట్లో అన్నపూర్ణా పిక్చర్సు అధినేత శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు ఉన్నారు

## డబ్బింగ్ చిత్రాలు

### 'చూడబోతే చుట్టాలే'

ఒక తమిళ చిత్రాన్ని తెలుగులో "చూడబోతే చుట్టాలే" అనే పేరుతో డబ్ చేస్తున్నారు ఈ చిత్రంలో జమున, కళ్యాణకుమార్, ఎం ఆర్ రాధా మొదలగువారు నటించారు రచన— కొడాలి గోపాలరావు, పాటలు శ్రీ శ్రీ, బి యస్ చారి, సంగీతం బాబూరావు, కూర్పు జి యస్ కృష్ణమూర్తి, నిర్మాత బ్రహ్మాండం వెంకటేశ్వరరావు

### స్త్రీ సామ్రాజ్యము

పురుషోత్తమ పిక్చర్సువారు "గోడన్" అనే తమిళ చిత్రాన్ని తెలుగులో "స్త్రీ సామ్రాజ్యం" అనే పేరుతో డబ్ చేస్తున్నారు

ఈ చిత్రంలో అంజలీదేవి, మాధురీదేవి, మనోహర్, రాంసింగ్ మొదలగువారు నటించారు

మాటలు కె ఏ ఆర్ ఆచార్య అండ్ ప్రసాద్; పాటలు బి ఎస్ చారి, కె వసంతరావు, కోట రంగయ్యశాస్త్రి, సంగీతం డి బాబూరావు, ఛాయ రహమాన్, కూర్పు జి యస్ కృష్ణమూర్తి; దర్శకత్వం కె వేంబు

## సావిత్రికి మైకం

ఒక తమిళ చిత్రం ఔట్‌డోర్ గురించి 'కావేరి కరై'— "ఎరిమిచ్చై కోలై" మొదలగు ప్రాంతాలకు వెళ్లారు ఒక మర్రిచెట్టుకు ఊయల కట్టి ఊగుతూ చుట్టూ తిరుగుతుంది సావిత్రి షూటింగ్ జరుగుతూనే ఉంది సావిత్రి ఊయల ఆపి క్రిందకు దిగబోయింది మైకం వచ్చి పడిపోయింది యూనిట్‌అంతా ఉపచర్యలు చేశారు తెలివి రాగానే కారణం అడిగారు షూటింగ్‌కు టైమ్ అయిపోతుందని ఉదయం కాఫీ మాత్రం తీసుకున్నానని, అందుచేత ఇలా జరిగిందని, ఏమీ భయంలేదని వెంటనే షూటింగ్‌కు తయారైంది

## యన్ టి రామారావు బాధ్యత

ప్రముఖ నటుడు యన్ టి రామారావు ప్రథమ పుత్రుడు రామకృష్ణ స్వర్గస్థుడై గత నెల 27వ తేదీ నాటికి సరీగ్గా సంవత్సరం అయింది కాని తిథి వార నక్షత్రాల ప్రకారం 17 వ తేదీన సంవత్సరీకం జరుపవలసివచ్చింది గతనెల 16, 17, 18 తేదులలో దేశరక్షణ నిధికి మన తెలుగు చలనచిత్ర కళాకారులు ఆంధ్రదేశంలో మూడుచోట్ల వినోద ప్రదర్శనా లివ్వడానికి వెళ్లారు మొదట విజయవాడలో జరిగింది ఈ పర్యటనలో రామారావుకు కూడ ప్రధానపాత్ర ఉంది విజయవాడ ప్రదర్శన అయిన వెంటనే కళాకారులందరూ ప్రభుత్వంచే ఏర్పాటు చేయబడిన రెండు డీలక్సు బస్సులలో హైదరాబాద్ బయలుదేరితే, రామారావు తన కొడుకు రామకృష్ణ సంవత్సరీకం గురించి స్వంత గ్రామం "నిమ్మకూరు" వెళ్లాడు జరుపవలసిన కార్యక్రమం జరిపి వెంటనే కారులో బయలుదేరి హైదరాబాద్ వెళ్లి కళాకారులను కలుసుకున్నారు బాధ్యత తెలిసిన యన్ టి రామారావు, అటు దేశరక్షణనిధి ప్రదర్శనల పర్యటనలోనూ, ఇటు తన కొడుకు రామకృష్ణ సంవత్సరీకంలోను కూడ వ్యవధి లేకపోయినా, గట్టిమనస్సుతో రెండింటికి హాజరయ్యాడు రామకృష్ణకు మనశ్శాంతి భగవంతుడు కలిగించుగాక!

## 'జ్ఞానేశ్వర్'

వి యస్ యన్ ఫిలింస్‌వారు జ్ఞానేశ్వర్ అనే చిత్రాన్ని తెలుగులోనికి డబ్ చేస్తున్నారు మాటలు జగన్నాథ్, బి శివరామ్, పాటలు : మల్లాది, సంగీతం వేలూరి కృష్ణమూర్తి, ఈ చిత్రంలో ప్లేబేక్ గాయకులుగా పాల్గొనినవారు ఘంటసాల, ఎ ఎం రాజా, పి బి శ్రీనివాస్, పి సుశీల, పి లీల, జానకి, యం యస్ రాజేశ్వరి; నిర్మాత : వి యస్ శంకర్

# తెరమీద "శ్రీ సింహాచల క్షేత్ర మహిమ"

"పిల్లనిదు అలాంటి అవస్థలకు ఈ అంతఃపురంలో ఎన్నటికీ స్థానంలేదు"

"నాన్నగారూ ! పురూరవుని హృదయంలో స్థానం పొందడమే ఆమెకున్న అర్హత కాదా !"

"కాదు చక్రవర్తిని వలచి వంచించే ప్రతి వర్తకి నగరానికి పట్టమహిషి కానేరదు"

"నాన్నగారు ! మీరు తొందరపడుతున్నారేమో ?"

"లేదు నీ తొందరపాటుకు నేను సిగ్గుతో కుమిలిపోతున్నాను"

"మీరు సిగ్గుతో కుమిలిపోయేంత నీచ కార్యమూ నే నాచరించలేదే హృదయమున్న మానవుడిగా ప్రేమించాను మాట తప్పని మహారాజుగా వివాహం చేసుకున్నాను అదే అపరాధ మంటారా ?"

"బాబూ ! ఈ ముసలితండ్రి మనోవేదననీకెలా వివరించాలో అర్థంకావడంలేదు ఈ కళ్ళల్లో వెలుగు ఈ కంఠంలో ప్రాణం నీ దిగంత యశస్సు గాంచి ఆనందించడానికే గాని, నీవిలా అంతస్సు దిగజారి, అధఃపతిడవైతే చూచి బాధపడటానికి కాదునాయనా !"

"సామ్రాజ్యమేలే చక్రవర్తినై ఉండి కూడా ఈమాత్రపు స్వాతంత్ర్యానికే నోచుకోలేదా ? నా అర్ధాంగిని ఎన్నుకునే అర్హతకూడా నాకులేదా?"

"ప్రభువుల జీవితాలు కేవలం ప్రజాను బంధకాలు ఉన్న స్వాతంత్ర్యము, అధికారం ప్రజా సంరక్షణకే గాని, స్వార్థంకోసం కాదు"

"ప్రభువంటే ప్రజాక్షేమంకోరే ప్రతినిధి అని మాత్రమే నాకు తెల్సు కాని ఇలా బంగారు సంకెళ్ళ మధ్య బందీ అని మాత్రం తెలియదు మీరాశించే వంశ ప్రతిష్ఠ కాపాడలేని నావంటి వాడు ప్రభువుగా ఉండటానికి అనర్హుడేమో ! అందుకు నేనీ సామ్రాజ్యమే త్యజిస్తాను"

"నాయనా ! విధులు త్రెంచుకువెళ్ళి పోవడం వివేకంకాదు సాంప్రదాయాలు సంరక్షించడమే వర్తుల ధర్మం"

"ధర్మం ధర్మం ధర్మం బానిసలు నమ్మి బ్రతుకే నా కంకితం చేసిన భార్యను కాపాడుకోలేని ఈ ధర్మం నాకెందుకు నన్ను వెళ్ళిపోనివ్వండి"

"వెళ్తావా ! వెళ్తావా నాయనా ! నీమీద ఎన్నెన్నో ఆశలు పెట్టుకున్న కన్నతండ్రిని కాదని వెళ్తావా ! అదే నీ నిర్ణయమైతే ఈ ముసలి తండ్రికొక సహాయం చెయ్యి నాయనా ?"

"ఆజ్ఞాపించండి !"

"అవమానంతో బ్రద్దలయే నా హృదయానికి నీచేతులా అంతిమ తర్పణం కూడా విడిచి వెళ్ళు !"

"నాన్నగారూ ! నన్నెందుకిలా చిత్రవధ చేస్తారు ఇక్కడే ఈ ఉక్కు పంజరంలో బంగారు చిలుకలా బ్రతికి, క్షణక్షణానికి ఒకకోటి చావులు చావాలని శాసిస్తున్నారా ?"

"స్వధర్మాన్ని గుర్తించిన సామ్రాట్టువి ఆ నిన్ను నేను శాసించగలనా !"

"నాన్నగారూ ! కన్న కుమారినిగా మీ పాదాల ముందు ప్రాణాలనైనా అర్పిస్తాను కాని ఒక అమాయకురాలి భర్తగా, ఆత్మద్రోహినై, వరి త్రలో అనామకుణ్ణి కాలేను అందుకు నన్ను క్షమించండి"

"వంశ గౌరవంకోసం కన్నబిడ్డనే కాదన్న కీర్తి మీకు, పవిత్ర ప్రేమకై సామ్రాజ్యాన్నే వదులుకున్న ప్రతిష్ఠ నాకూ దక్కనివ్వండి శలవు"

"చిరంజీవి ! చిరంజీవి ! !"

ఈ సన్నివేశం శ్రీ సరస్వతీ మూవీస్ అండ్ శ్రీ వెంకటేశ్వర ఫిలింస్వారి "శ్రీ సింహాచల క్షేత్ర మహిమ" లోనిది ఈ మధ్య వాహినీ స్టూడియోలో పురూరవ చక్రవర్తి రాజమందిరం పెద్ద సెట్టు వేశారు పురూరవుడు ప్రేమించిన ప్రేయురాలిని గాంధర్వ వివాహమాడుతాడు ఆ విషయం పురూరవ చక్రవర్తి తన తండ్రి వృద్ధ మహారాజు కెరిగించి, తన ప్రేయురాలినే పట్టమహిషిగా చేసుకోదలచినట్లు, ఆ విధంగా చేయమంటాడు

రాజ సాంప్రదాయాలకు విరుద్ధమైన అట్టి వంటి పనులు చేయకూడదని మందలిస్తాడు హెచ్చరిస్తాడు వృద్ధ మహారాజు అయితే సామ్రాజ్యాన్నే త్యజిస్తానంటాడు పురూరవుడు తండ్రీ కొడుకుల మధ్య ఈవిధంగా పట్టుదలు పెరుగుతాయి పురూరవుడు సామ్రాజ్యాన్ని వదలి, తండ్రిదగ్గర సెలవు తీసుకు వెళ్ళిపోతాడు

తండ్రిగా నాగయ్య, పురూరవుడు (కొడుకు) కాంతారావు పోల్గొంటారు వీరుగాక ఈ చిత్రంలో ఇంకా రేలంగి, రాజనాల, చలం, రాజబాబు, నల్ల రామమూర్తి, కృష్ణకుమారి, కాంతి, గిరిజ మొదలగువారున్నారు

ఈ చిత్రానికి మాటలు— పాటలు రాజశ్రీ ఛాయ : మధు, సంగీతం టి వి రాజు, కూర్పు : హర్నాండ్, కళ బిన్ యన్ కృష్ణ, స్టూడియో



అందాల నటి "క్రిస్టయిన్ కాల్వెట్"

# అవీ ఇవీ అన్నీ

విజయా— వాహినీ కథ దర్శకుడు బి వి ప్రసాద్

## సెట్టుమీద 'అనుబంధాలు'

ప్రియ, సన్యాసిరావు లిద్దరూ చదువుకున్న వాళ్ళే ఎవరి తల్లి దండ్రులు వారికి వివాహాలు నిర్ణయిస్తారు వారిద్దరికీ ఎవరితో వాళ్ళకు వివాహం నిశ్చయమైనదీ తెలియదు సన్యాసిరావు పెళ్ళికి ఇంటికి బయలుదేరుతాడు ఎవరో అవాను కుడికిచ్చి తనకు వివాహం చేస్తారన్న ఉద్దేశ్యంతో ప్రియ పరారీ అవుతుంది ఇద్దరు ఒక రైలులో ఒకే కంపార్టుమెంటులో ప్రయాణంసాగిస్తుంటారు ఇద్దరూ చూపులతో మాట్లాడుకుంటారు అదే ప్రేమ — పెళ్లివరకు దారితీస్తుంది వివాహానికి అంగీకరించుకుంటారు రిజిస్ట్రారు ఆఫీసుకు వెళ్తారు

అంటాడు సన్యాసిరావు రెండు జంటలకీ రిజిష్ట్రీ వివాహం జరుగుతుంది —

"ఊఁ ! అయితే వివాహం చేసుకునేందుకు మీ రిద్దరూ అంగీకరించినట్లేగా !"

"షేమ్ ! షేమ్ !! ఇంకా అట్లే ఏమిటండీ! అట్నా, దోసెలూను ! అంగీ.. కారమే !! ఏం ప్రియా ?"

"మరి—సాక్షి సంతకం ఎవరు చేస్తారు ?"

"ఎవరో ఎందుకండీ, మీరే చేస్తే పోలా !"

"నేనా ?— రూల్స్ ! అలా చెయ్యడానికి వీల్లేదు "

"ఓహో ఐతే పెద్ద చిక్కులోనే చిక్కుకున్నామే ఏం చేద్దాం ప్రియా ?"



అమరూపావారి "అనురాగం"లో గిరిజా, చలం

"మేము వివాహానికి వచ్చాం ! చేసేయండి" అంటారు ఇందుకు సాక్షులు కావాలంటాడు ఆ వివాహాల రిజిస్ట్రారు "ఎవరో ఎందుకండీ" ! మీరే సాక్షిగా ఉండండి !" అంటాడు సన్యాసిరావు "రూల్సు ప్రకారం నేను సాక్షిగా ఉండటానికి వీలులేదు " అంటాడు పెండ్లిళ్ల రిజిస్ట్రారు

ప్రియ, సన్యాసిరావు లిద్దరూ పెద్ద చిక్కులో పడ్డామని ఒకరి ముఖాలొకరు చూసుకుంటారు ఆ సమయానికి 70 ఏళ్ల ముసలిజంట రి జి ష్ట్రీ పెళ్లికి వస్తారు వారిద్దరినీ సాక్షులుగా ఉండమని సన్యాసిరావు కోరుతాడు "సాక్షులుగా పనికిరాము మేము పెళ్లిచేసుకోడానికి వచ్చామంటాడు" ఆ ముసలి వరుడు "అయ్యో ! కర్మ ! పెళ్లికి పనికివచ్చినవారు సాక్షులుగా ఎందుకు పనికిరారు! మీ పెళ్లికి మేము సాక్షులం మా పెళ్లికి మీరు సాక్షులు గా ఉండండి"

అదే సమయంలో 70 ఏళ్ల ముసలి—జంట రిజిష్ట్రీ పెళ్లికి వస్తారు

"వారిని చెయ్యమనండి "

"రండయ్యా ! రండి ! రండి !! మీకోసమే చూస్తున్నాం ఇక్కడొక సాక్షి—సంతకం పారెయ్యండి "

"సాక్ష్యానికి నేను పనికిరానయ్యా బాబూ ! నేను పెళ్లిచేసుకోడానికి వచ్చాను "

"షేమ్ షేమ్ అదేం మాటయ్యా ! పెళ్లికే పనికివచ్చినవాడివి, సాక్ష్యానికి పనికి రాక, ఎక్కడకు పోతావయ్యా పెద్దమనిషీ ! నా పెళ్లికి నువ్వు చెయ్యి ! నీ పెళ్లికి నే చేస్తాను రా ! రా !! రా !!! "

ఈ సన్నివేశం వాసవీవారి ప్రథమ చిత్రం "అనుబంధాలు" చిత్రంలోనిది సన్యాసిరావుగా పద్మనాభం, ప్రియగా స్వర్ణలతో చిత్రీకరింపబడింది

ఈ చిత్రంలో జగ్గయ్య, గుమ్మడి, రమణారెడ్డి, పద్మనాభం, కె వి యస్ శర్మ, చదలవాడ, కృష్ణకుమారి, స్వర్ణ, నాగరత్నం బేబి పద్మిని మొదలగువారు నటించారు

రచన పిచ్చేశ్వరరావు, పాటలు సముద్రాల (సీనియర్), కొసరాజు, సి నారాయణరెడ్డి, దాశరథి, సంగీతం యం బి శ్రీనివాస్, ఛాయ వెంకట్, కూర్పు రాజన్, స్టూడియో పినస్, దర్శకుడు రామకృష్ణ (భరణి), నిర్మాత కె వెంకటేశ్వరరావు

## ఫిలిం ఛాంబర్ విందులో మొరార్జీకి అజీర్తి

సుంకాలు తగ్గించమని ఫిలిం ఛాంబర్ కోరితే తారల కిచ్చే బ్లాక్‌మనీ — పద్ధతి కొనసాగించి నన్నాళ్ళు అది తప్పదని జవాబు

కేంద్ర ఆర్థిక మంత్రి శ్రీ మొరార్జీ దేశాయి మద్రాసు విచ్చేసినప్పుడు ఈ నెల 8వ తేదీ సాయంత్రం సౌత్ ఇండియన్ ఫిలిం ఛాంబర్ భారీ ఎత్తున శ్రీ మొరార్జీకి విందు ఏర్పాటు చేసింది విందు అనంతరం పి సుశీల ప్రార్థన చేసింది ఛాంబర్ అధ్యక్షులు శ్రీ ఏ ఎల్ శ్రీనివాసన్ ఒక మెమరాండం సమర్పించారు అదే పనిగా ఫిలిం పరిశ్రమపై కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, మద్రాసు కార్పొరేషన్‌వారు విధిస్తున్న పన్నుల భారాన్ని తగ్గించమని ఆ మెమ రాండంలో ఉంది

దానికి సమాధానమిస్తూ శ్రీ మొరార్జీ 'మొదటి భోజనం పసందుగా ఉంది జీర్ణ మవుతుంది కాని ఈ మెమరాండం—భోజనం అజీర్తి కలిగించే టట్టుగా ఉంది మింగలేను' అని జోక్ విసిరేరు

పన్నులు, సుంకాలు తగ్గించమని కోరేముందు, నిర్మాతలు తారల కిచ్చే పెద్ద పెద్ద మొత్తాలలో లెక్కలలో కన్పడేది ఒక వంతు అయితే, మూడు వంతులు కన్పడకుండా బ్లాక్ మనీగా ఉండిపోతున్న దనేదీ అందరూ అంగీకరించిన సత్యమే ఈ బ్లాక్ మనీ మూలంగా ప్రభుత్వము చాలా ఆదాయవు పన్ను పోగొట్టుకుంటోంది అంతేగాక ఈ బ్లాక్ మనీకి సమాజాన్ని కలుషితం చేసే స్వభావం ఎక్కువగా ఉంది అందుచేత యిటు సమాజంలో ఆరోగ్యకరంగా ఉండాలంటేను, అటు సుంకాలు తగ్గించాలంటేను, ముందుగా నిర్మాతలు-ముఖ్యంగా పెద్దలు ఆలోచించుకొని తారల కిచ్చే మొత్తాలను తగ్గించుకుంటూ బ్లాక్‌మనీ — పద్ధతిని నిర్మూలించటానికి పూనుకుంటే సుంకాలు తగ్గించేందుకు సాధనం ఉంటుందని మొరార్జీగారు జవాబు చెప్పారు

ఛాంబర్ తరపున శ్రీ పి పుల్లయ్య వందన సమర్పణ చేశారు

## చిత్రంలో సావిత్రిద్వయం

ఔట్‌డోర్ షూటింగ్‌కు ఒక ఫిలిం కంపెనీ వారు చాలితో ఉన్న ఆవును, నటి సావిత్రిని, మరికొంతమంది ఆర్టిస్టులతో యూనిట్ అంతా వెళ్లింది ఔట్‌డోర్‌లో ఆవు ఈనింది దూడ అందంగా ఉంది ఆ దూడను చూసి సావిత్రి చాల ముచ్చటపడింది అంత అందంగా ఉన్న దూడకు సావిత్రిఅని నామకరణం చేశారు ఈ సావిత్రి ద్వయం ఆ చిత్రంలో పాల్గొన్నారు

# సాగరగర్భంలో...

సాగరగర్భంలో అణుశక్తి ప్రేరితమైన పరిశోధనాలయం ఒకటి నిర్మించి, అమెరికాలో యీ దిగువనున్న సాధనాలతో కొత్త ప్రయోగాలు విశేషాలు అమెరికాలోని శాస్త్రజ్ఞులు చేయనున్నారు

(1) బొమ్మలో నున్నది సముద్ర గర్భంలో అమెరికను శాస్త్రకారులు నిర్మించనున్న అణుశక్తి ప్రేరితమైన పరిశోధనాలయం దీని నమూనా చేసినవారు అక్కడి "వెస్టింగ్ హౌస్ విద్యుత్ సంస్థ" వారు ఈ లాబొరేటరీ గోళాకారంగా వున్నది అణుశక్తి నుత్పత్తిచేసే గది ఈ 'నమూనా' పూర్తయితే 'అంతర్లోకం'లోని మరిన్ని నిజాలు ఖనిజాలు తెల్సుకోవచ్చును





...పరిశోధనాలయం (1)



(2)

(2) ఈ బొమ్మలోని ('నవ నా') వాహనం పేరు "పాత తార" అనొచ్చును ఇది సముద్ర గర్భంలో ప్రయోగాల నిమిత్తం ప్రయాణం చేస్తున్నప్పుడు ఏదేనా ఆటంకం వస్తే - వెంటనే లోప 'చోదకునికి' మూడురకాల యంత్రాల ద్వారా తెలిసిపోతుం ఒక 'పైలట్' ఒక పర్యవేక్షకుడ వుంటారు ఒక పర్యవేక్షకుడు బ టికి ప్రత్యేకమైన కటకం గుం చూడగలడు ఈ 'పాతాళ తార రెండు 'యాంత్రిక బాహు లున్నాయి వీటికి దీపాలు కూ వుంటాయి ఈ చేతులను చిత్రం చూడవచ్చును వీటిని లోపలి శోధకులు తమ యిచ్ఛానుసా పని చేయించగల్రు

(3) సముద్ర గర్భంలోని వి విశేషాలు గమనించగల వాహనం పేరు "సీపప్" గుడ్ల గుడ్లు 'రాక్షస నాలిక' గల యంత్రంలో యిద్దరు మనుష పరిశోధనా పరికరాలు సుళ సముద్రగర్భంలోకి దిగవచ్చు "సీపప్" ను అమెరికా "మాసచుసెట్స్"కు చెందిన హాల్' సంస్థ తయారు చేసిం

Edited Printed and Publish
S Radhakrishna at the A
Patrika Press, 6 & 7 Th
chetty Street, Madras-
Chief Editor S. Sambhu P

# పొదుపుకోసం అమృతాంజన్ అట్టపెట్టెల్లో వస్తోంది

నేడు మన దేశపు ఆదాయము రక్షణ కొరకు అవసరము సాధారణంగా పరిచితమైన అమృతాంజన్ డబ్బా తయారుచేయడానికి కావలసిన టిన్ రేకు నేడు జాతీయ అత్యవసరాలకు కేటాయింపబడినది కాబట్టి దీనికిబదులు మేము క్రొత్త రకం పొదుపైన అట్ట పెట్టె వాడుతున్నాము. ఇంతేగాకుండా సీసాలో నమ్మకమైన అమృతాంజన్ అందజేయడానికి మోసంచేయడానికి వీలులేకుండా 'అలు'కాప్ ('Alu'-cap) తో సీసా సీలు చేయబడింది ■ పూర్వం ఎప్పటికంటే కూడా ఇప్పుడు మీకు అమృతాంజన్ ఎక్కువ అవసరము కండల నొప్పులు, బెణుకులు, గుండె జలుబులు, కీళ్ళ నొప్పులు. ఆరోగ్యం చెరచి నీరసపరచి అధికంగా కావలసిన ఉత్పత్తులను తగ్గించే రోగాలు నిర్మూలించడానికి సహకరిస్తుంది.

*అమోఘమైనది, మిత వ్యయంతో కూడినది, అనేక విధాల ఉపయోగపడేది.*

అమృతాంజన్ అమోఘంగా పనిచేసే నొప్పుల నివారణిని మీరు కొనవచ్చు. ఇటువంటి మందులన్నిటికంటె దీనిలో గుణవహకమైన ఔషధాలు అధిక పరిమాణాల్లో ఉంటాయి ■ దీనిలో ఏకమైయున్న మందులు బాధలను నివర్తించి వెంటనే ఉపశమనం కలిగించడానికి శరీర చర్మంలో అతి శీఘ్రంగాను లోతుగాను ప్రవేశిస్తాయి. ప్రతీసారి మీకు ఏ నాలుగు వడ్లగింజల ఎత్తో అమృతాంజన్ కావలసి ఉంటుంది. ఇంట్లో ఇంటిల్లిపాదీ ఉపయోగించినా ఒక బుడ్డి నెలల తరబడి ఉపయోగానికి వస్తుంది.




# అమృతాంజనము

ఆరోగ్యం ఇస్తుంది.

అమృతాంజన్ లిమిటెడ్ 14/15 లజ్ చర్చి రోడ్, మద్రాసు-4


గుండె జలుబు


కీళ్ళ నొప్పులు


తల నొప్పులు

NT-AM-2225a




కల్పన